LONGEST LIVING NEWSPAPER IN TELUGU JOURNALISM   Visit Internet Edition @ www.zaminryot.com "e-mail : editor@zaminryot.com"

# జమీన్‌రైతు




స్థాపకుడు : నెల్లూరు వెంకట్రామానాయుడు   సంపుటి : 71   సంచిక : 51   22.12.2000   శుక్రవారం   12 పేజీలు   విడిప్రతి : రూ.2.00లు   జీవప్రదాత : నెల్లూరు శ్రీరామమూర్తి

# స్థానిక ఎన్నికల్లో "గిట్టుబాటుకే" కేంద్రంపై బాబు గరం, గరం!

దిగజారిపోయిన ధాన్యం ధరల విషయంలో, రైతుల అగచాట్లకు సంబంధించి తాను, తన పార్టీ చేయగల్గింది ఏదీ లేదని; తప్పంతా కేంద్ర ప్రభుత్వానిదేనని తేల్చి చెప్పారు ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు. రాజకీయంగా ఆయన ఎంత తెలివైనవాడో, ఎంతటి ఘటనాఘటన సమర్థుడో రుజువు చేసింది పరిణామం. తన తప్పును అవతలి వాడి

## రైతుల పేరుతో నీచ రాజకీయం

నెత్తిన రుద్ది, తప్పించుకొనే విద్య ఆయనకు అన్నప్రాసననాడే అబ్బింది. ఆ నైపుణ్యంతోనే ప్రజలను అత్యద్భుతంగా మాయ చేయగల్గుతున్నాడు. ఇప్పుడూ అంతే.

ధాన్యం ధరలు పడిపోయి, వ్యవసాయం గిట్టుబాటు కాక అలమటిస్తున్న రైతాంగం మూడోకన్ను విప్పిందంటే తాను మాడిమసైపోతానని ముఖ్యమంత్రికి తెలుసు. ఆరు నెలల లోపల పంచాయతి ఎన్నికలు పెట్టుకొని, అంతటి ముప్పు తెచ్చుకొనే మూర్ఖుడు కాడాయన. అట్లని రైతులను గట్టెక్కించ డానికి దారివెతికే ఆలోచన చేయడం లేదు. అది ఖర్చుతో కూడిన పని. చిల్లిచిడబ్బు ఖర్చు లేకుండా సమస్య నుంచి తాను తప్పుకునేందుకు చంద్రబాబు పన్నిన తెలివైన పన్నాగం - కేంద్రంపై నిందలు. ఎఫ్‌సిఐ చురుకుగా వడ్లు, బియ్యం కొనుగోలు చేయనందు వల్లనే ఈ పరిస్థితి ఏర్పడిందని; తాను ఎంత అరచి గీపెట్టినా కేంద్ర మంత్రులు కదలిరావడం లేదని; ఎఫ్‌సిఐ అధికారులలో మానవత్వం లేదని గతవారం రోజుల నుంచి గొంతు చించుకొని అరుస్తున్నాడాయన. రైతులకు మరింత స్పష్టంగా ఆ సందేశం చేర్పించడం కోసం పార్లమెంట్‌లో తెలుగుదేశం ఎమ్పీలు రెండు రోజుల పాటు గందరగోళం సృష్టించారు. రైతుల కోసం కేంద్రంతో తెగతెంపులు చేసుకోవడానికి తాను సిద్ధమని గంభీరంగా ప్రకటించాడు ముఖ్యమంత్రి.

### ఎందుకీ వెర్రికేకలు!

చూసేదానికి, వినేదానికి ఎంతో ఇంపుగా వున్నాయవి. కాని వాటి వల్ల రైతులకు జరిగే మేలేమిటన్నదే ప్రశ్న. రాష్ట్రంలో దాదాపు 80లక్షల టన్నుల ధాన్యం నిల్వలు వున్నాయని అంచనా. ఎఫ్‌సిఐ కొనుగోలు సామర్థ్యం కేవలం 15 నుంచి 20లక్షల టన్నులు మాత్రమే. అది కూడా వారు వడ్లు కొనలేరు; మిల్లర్ల నుంచి బియ్యం మాత్రమే కొనడం ఇప్పటి వరకు నడిచిన సాంప్రదాయం. పంజాబ్‌లో పరిస్థితి వేరు. కొన్ని దశాబ్దాల క్రితమే అక్కడ ఎఫ్‌సిఐ ధాన్యం కొనుగోలుకు యంత్రాంగం ఏర్పర్చుకొన్నది. ఇప్పటికిప్పుడు ఆంధ్రలో వడ్లు కొనమని వత్తిడి చేస్తే - వారేమి చేయగలరు? కొన్న వడ్లు ఎక్కడ నిల్వ చేయాలి. ఏ మిల్లులో ఆడించాలి? అప్పటికీ ఎఫ్‌సిఐ గత ఏడాది కంటే అదనంగా 3లక్షల టన్నుల ధాన్యం సేకరించింది. ఎంత గట్టిగా వెర్రి కేకలు పెడితే మాత్రం వారు అంతకంటే చేయగల్గింది ఏమి వుంది? ఆడలేక మద్దెల ఓడు అనడం అంటే ఇదే! కేంద్ర వ్యవసాయమంత్రి అందువల్లే స్పష్టంగా ప్రకటన చేశారు - తెలుగుదేశం ఎమ్పీలు కావాలని రభస సృష్టిస్తు

## అసలు సమస్యని పక్కదారి పట్టించారు

న్నారని!

### ప్రక్కదారి పడుతున్న సమస్య

కేంద్రాన్ని నిందించి, ఎఫ్‌సిఐ అధికారులను తిట్టిపోసి అసలు సమస్యను ప్రక్కదారి పట్టిస్తున్నాడు ముఖ్యమంత్రి. ధాన్యం ధరలు పతనం కావడానికి కారణం - ఎఫ్‌సిఐ కొనుగోలు మందగించడం కాదు; ఎగుమతులు, దిగుమతులలో కేంద్ర ప్రభుత్వం అనుసరించిన అపసవ్య విధానాలే అసలు కారణం. డబ్ల్యుటిఓ ఒప్పందం ప్రకారం ధాన్యం వంటి ప్రాథమిక ఉత్పత్తులపై 100శాతం వరకు; ప్రాసెస్ చేసిన టమోటో జ్యూస్, వెన్న, నెయ్యి వంటి వాటిపై 150 శాతం, వంట నూనెలపై 300 శాతం వరకు దిగుమతి సుంకం విధించేందుకు భారత దేశానికి అనుమతి వుంది. కాని కేంద్ర ప్రభుత్వం చివరి క్షణం వరకు ఈ అధికారాన్ని వినియోగించలేదు. వంట నూనెలపై కేవలం 15శాతం మాత్రమే దిగుమతి సుంకం విధించడంతో వేరుశనగ, పామాయిల్ వంటి నూనెలు విదేశాల నుంచి లక్షలాది టన్నులు దేశంలోకి వచ్చేశాయి; బియ్యం దిగుమతిని ఒజిఎల్‌లోకి మార్చి, ఆ తర్వాత నియంత్రణ మర్చిపోవడంతో వియత్నాం వంటి దేశాలు తమ నిల్వలు భారత్‌లో క్రుమ్మరించేశాయి. దాని ఫలితమే ఈ

కొరవ 12వ పేజీలో

# బాబు-వైఎస్ 'సంధి'పై ప్రేలాపనలు

చవితినాడు చంద్రుడ్ని చూశాడేమో - సిఎల్‌పి నేత డాక్టర్ వైఎస్. రాజశేఖరరెడ్డి - అర్థం, పర్థం లేని నీలాపనిందలు నెత్తిన పడుతున్నాయి. తన తత్వానికి, తన రాజకీయవైఖరికి పొంతనలేని ఆరోపణలు ఎదుర్కోవలసి వస్తున్నది.

రాజశేఖరరెడ్డి జీవితమంతా రాజీలేని పోరాటమన్న సంగతి తెలియని

## అటు తెలుగు బాకాల హోరు - ఇటు పార్టీలో వర్గపోరు!

వారు లేరు. గత ఇరవైయేళ్లనుంచి అదే తీరు; ఏ మాత్రం మార్పు లేదు. స్వంత పార్టీలో అంతే; పరాయి పార్టీల విషయంలోనూ అంతే. అధికారంలో ఎవరుంటే వాళితో పేచీ వద్దన్నా వచ్చేస్తుంటుంది. కడదాకా అది నడుస్తూనే వుంటుంది. నిత్య అసమ్మతివాది, సతత అసంతృప్తజీవి వంటి బిరుదులు చాలానే వున్నాయాయనకు. అది ఆయన రాజకీయ శైలి; కాని ఇప్పుడు అందుకు పూర్తి విరుద్ధమైన నిందపైన పడింది; ముఖ్యమంత్రి చంద్రబాబుతో రాజీపడిపోయాడన్న ఆరోపణతో ఆయన్ను ఉక్కిరి బిక్కిరి చేసేస్తున్నారు. ఎవరో బయటి వారు కాదు; స్వంతపార్టీలోని, తోటి కాంగ్రెస్‌వాదులే ఆయన్ను ఈ ఆరోపణ ఉచ్చులో ఇరికించేశారు.

చంద్రబాబు అవినీతి, అక్రమార్జన, అధికార దుర్వినియోగంపై విచారణ జరపాలని కోరుతూ రాజశేఖరరెడ్డి హైకోర్టులో చాలా కేసులు దాఖలు చేశారు. ఎప్పుడో, అసెంబ్లీ ఎన్నికలకు ముందే చేసిన ప్రయత్నం ఇది. చంద్రబాబు సంపాదించిన వందలాది కోట్ల రూపాయల ఆస్తులపై అప్పట్లో రుజువులు, ఆధారాలు, ఫోటోలు, రిజిష్టర్ పత్రాలతో సహా పత్రికలలో వివరించినా ప్రభుత్వంలో కదలిక లేకపోయేసరికి న్యాయస్థానాన్ని ఆశ్రయించాడు. మాదాపూర్‌లో ఫార్మ్‌హౌస్, హెరిటేజ్ ఫుడ్స్ భవంతి వంటి ఫోటోలు ప్రజలకు ఇంకా గుర్తే. ఇంత స్పష్టమైన ఆధారాలతో అవినీతి బయటపడితే - మరే రాజకీయ నాయకుడైనా శంకరగిరి మాన్యాలు పట్టిపోయి వుండేవాడు. కాని చంద్రబాబు మహా జిత్తులమారి; పైగా ఆయనకు పత్రికల అండవుంది. ఆ పత్రికలలో ఎంత అరచి గీపెట్టినా వ్యర్థమనే నిర్ణయానికి వచ్చి హైకోర్టుకు వెళ్లాడు రాజశేఖరరెడ్డి. ఆ వివాదంలోనే ఆయనకు, ఈనాడు అధినేత రామోజీరావుకు మధ్య పేచీ వచ్చిన విషయమూ అందరికీ తెలుసు. కొమ్ములు తిరిగిన నేతలు సైతం 'ఈనాడు' దినపత్రిక, 'ఈ టీవి' ప్రభావానికి భయపడి రామోజీరావుకు పాదాక్రాంతమౌతున్న పరిస్థితుల్లో ఇంత పెద్ద పేచీకి సిద్ధపడ్డాడు రాజశేఖరరెడ్డి. దాని వల్ల గత రెండు, మూడేళ్లుగా ఆయన చాలా సమస్యలు ఎదుర్కొంటున్నాడు కూడా! రాజశేఖరరెడ్డి గోరంత తప్పు చేసినా, ఈనాడు దినపత్రికలో కొండంత విమర్శ రావడం ఆనవాయితీ అయిపోయింది. ప్రజల మనస్సుల్లో ఆయన్ను ఒక నేర స్వభావిగా ముద్రవేయడానికి ఆ పత్రిక ఎంతో

కొరవ 12వ పేజీలో

# పవర్ బ్రోకర్ "పవర్"

ఢిల్లీ రాజకీయ బ్రోకర్ల వద్ద తన పలుకుబడి ఎంత పటిష్టంగా వుందో మరొకమారు నిరూపించాడు చింతా మోహన్! కాంగ్రెస్‌పార్టీ ప్రాథమిక సభ్యత్వం సైతం తీసుకోకుండానే ఆయన్ను పిసిసి సభ్యుడిగా నియమించింది అధిష్టానవర్గం. అదీ ఆయన స్వంతవూరు తిరుపతిలో కాదు; ఆయనెవరో కూడా తెలియని నిజామాబాద్ జిల్లా కాంగ్రెస్‌చేత పేరు వ్రాయించింది.

చింతామోహన్ ఒకటికి నాలుగు సార్లు ఎమ్పీగా గెలిచాడు; కేంద్ర మంత్రిగా యోగం అనుభవించాడు. జీవితంలో ఒక స్థాయి, ఒక అంతస్తు సాధించాడు. అయినా గుణం మాత్రం మారడం లేదు. ఎక్కడి నుంచైతే తాను రాజకీయ నిచ్చెన ఎక్కాడో, ఏ ప్రజలైతే తనకు ఓట్లువేసి అందలం ఎక్కించారో - వారి పట్ల చింతామోహన్‌కు ఎక్కడ లేని చిన్నచూపు. తిరుపతి ఓటర్లు ఆయన దృష్టిలో గొంగళి పురుగులు; ఆంధ్ర కాంగ్రెస్ నేతలు ఆయన దృష్టిలో దండగమాలిన సరుకు. అసలు కాంగ్రెస్ పార్టీయే ఒక న్యూసెన్స్! నియోజక వర్గంతో సంబంధాలు అంటేనే ఒళ్లు జలదరింపు. ఢిల్లీలో, సోనియాగాంధీ ఇంట్లో ఒకరో, ఇద్దరో చప్రాసీల దగ్గర తనకున్న చనువును అడ్డంపెట్టుకొని మొత్తం రాష్ట్ర కాంగ్రెస్ పార్టీని, ఓట్లేసే ప్రజలను వెర్రి వాజమ్మల క్రింద జమకట్టేస్తుంటాడు చింతామోహన్.

గత ఎన్నికలలో పిసిసికి దరఖాస్తు చేయకుండానే పిసిసి చేత ఎమ్పీ

## ఢిల్లీ గల్లీల్లో చింతా హవా

టిక్కెట్‌కు తన పేరు సిఫార్సు చేయించుకొన్నాడాయన. ఇప్పుడు కనీసం పావలా సభ్యత్వం కూడా తీసుకోకుండా పిసిసి సభ్యుడై పోయాడు. రేపు నేరుగా ఎఐసిసిలో స్థానం సంపాదించినా ఆశ్చర్యం లేదు. ఢిల్లీలో ఆయన పలుకుబడి అటువంటిది. పార్టీ పట్ల, పార్టీ సంస్థల పట్ల, పార్టీ నాయకుల పట్ల ఇంత తేలిక భావం ప్రదర్శించడం పెద్ద గొప్పతనం అనుకొంటే - పొరపాటు.

కొరవ 7వ పేజీలో

# ఆంక్షలసంకెళ్లలో రైతాంగం

డబ్ల్యుటిఓ ఒప్పందం ద్వారా విదేశాలకు స్వేచ్ఛా మార్కెట్ వసతి సృష్టించిన కేంద్ర ప్రభుత్వం - స్వదేశీ రైతుల విషయంలో మాత్రం సవాలక్ష ఆంక్షలు కొనసాగిస్తున్నది. అందులో మొదటిది - స్వేచ్ఛారవాణా! ఒక రాష్ట్రంలో పండిన బియ్యాన్ని, ఇతర వ్యవసాయ ఉత్పత్తులను పొరుగు రాష్ట్రాలకు, ఇతర దేశాలకు పంపేందుకు రైతులకు అనుమతి లేదు. ఎఫ్‌సిఐ లెవీ నిబంధనలు పాటించి, పర్మిట్ ఇచ్చినంత మేరకే ఇతర రాష్ట్రాలలో విక్రయించాలి. ఈ నిబంధన వల్ల రైతులు లాభం పొందుతారు. ఎక్కడ అధిక ధర

**డబ్ల్యు.టి.ఓ. ఒప్పందాల దుష్ఫలితం**

వుందో అక్కడకు తరలించి విక్రయించ వచ్చు. వివిధ రాష్ట్ర ప్రభుత్వాలు విధి స్తున్న అమ్మకపు పన్నులోని వ్యత్యాసాలు, చెక్‌పోస్టుల బ్లాక్‌మెయిలింగ్ వ్యవసాయ ఉత్పత్తులకు మార్కెట్ లేకుండా చేస్తున్నాయి. వ్యవసాయం ఉత్పత్తి ఏదైనా, ఏ దేశానికైనా ఎగుమతి చేసుకొనే స్వాతంత్ర్యం కల్పిస్తే దిగుమతుల వల్ల కల్గే నష్టం పూడుతుంది. కాని విదేశీ వ్యాపారుల పట్ల అంతగా ప్రేమ కన్పరు స్తున్న కేంద్ర ప్రభుత్వం స్వదేశీ రైతుపై సవాలక్ష ఆంక్షలు విధించి సతా యిస్తున్నది.

### ఎందుకీ ఎఫ్‌సిఐ?

దేశంలో ఆహార కొరత తీవ్రంగా వున్నప్పుడు, ఆహార సెక్యూరిటీ కోసం ఎఫ్‌సిఐని స్థాపించారు. హైహవసరాలకు, రేషన్‌షాపులకు కనీసం 3నెలలకు సరిపడా నిల్వచేసి పెట్టడం ఈ సంస్థ కార్యకలాపం. కరువు వంటి ప్రకృతి వైపరీత్యాలు; యుద్ధాల వంటి విపత్కర పరిస్థితులు ఏర్పడినప్పుడు తిండి గింజలు దొరకని ప్రమాదం ఏర్పడకుండా - ఒక వైపు; వ్యాపారులు మార్కెట్ ధరలు అపరిమితంగా పెంచితే నియంత్రించడం మరొక వైపు వున్నప్పుడు మాత్రమే ఎఫ్‌సిఐ రంగంలోకి దిగాలి. కాని ఇప్పుడా పరిస్థితి లేదు. ఎఫ్‌సిఐ దగ్గర ఇప్పుడు 7 నెలలకు సరిపడా ఆహార నిల్వలున్నాయి. అస్సాం వంటి రాష్ట్రాలలో సైతం వ్యవసాయ దిగుబడులు పెరిగి పోవడంతో ఎఫ్‌సిఐ నుంచి ధాన్యం అడిగే రాష్ట్రాలే లేకుండా పోయాయి. అసలా సంస్థ అస్తిత్వమే అనవసరం ఇప్పుడు. దీనివల్ల ఆహార ధాన్యాల నియంత్రణ చట్టం యధాతథంగా వుండిపోతున్నది. లెవీ వంటి కాలం చెల్లిన విధానాలు ఇంకా అమలౌతున్నాయి. రైతుల కష్టాలకు ఇదీ ఒక కారణం.

### ఆకలి చావులు మాత్రం అట్లే వున్నాయి!

ఎఫ్‌సిఐలో ఒక ప్రక్క గోడౌన్‌లు పట్టనంతటి ఆహార నిల్వలు వుంటే, మరొక ప్రక్క దేశంలో ఆకలిచావులు మాత్రం తగ్గడం లేదు. ప్రభుత్వాల అసమర్ధతకు, అపసవ్య విధానాలకు ప్రత్యక్ష నిదర్శనం ఇది. గత 3నెలలలో ఒరిస్సా రాష్ట్రంలో 35 మంది నిరుపేదలు అన్నమో రామచంద్రా అని అలమటిస్తూ మరణించారు. కొన్ని వేల మంది ఆకలి బాధతో అల్లాడుతున్నారు. మన రాష్ట్రంలోనూ మార్చి నెలలో, మహబూబ్ నగర్ జిల్లాలో ఆకలి చావులు తటస్థించాయి. రాయలసీమలో కమ్యూనిస్టు పార్టీలు గంజి కేంద్రాలు నిర్వహించాయి. ప్రభుత్వాలకు ప్రజల పట్ల వి. మాత్రం చిత్తశుద్ధి వున్నా ఎఫ్‌సిఐ గోడౌన్లలో

కొరవ 7వ పేజీలో





వి.ఆర్. కాలేజి ఎస్.ఏ. రామమూర్తి ఫౌండేషన్ స్మారక ఉపన్యాస కార్యక్రమాన్ని జ్యోతి వెలిగించి ప్రారంభిస్తున్న ఎమ్మెల్యే వివేకానందరెడ్డి, ప్రక్కన ప్రిన్సిపల్ గోపాలకృష్ణమూర్తి, ఫిజిక్స్ హెడ్ ఆఫ్ ది డిపార్ట్‌మెంట్ ఎస్.కె.ఎం. బాషా వున్నారు.

# రొయ్యలు తిన్నాయి - షేర్లు మింగాయి

నెల్లూరు, మద్రాసు కేంద్రాలుగా సి ఫైనాన్స్‌ను స్థాపించి, వేలాది మంది డిపాజిటర్లకు కుచ్చుటోపి పెట్టి, వాళ్ల ఉసురు పోసుకున్న సిటీఫైనాన్స్ మేనేజింగ్ పార్టనర్ గాదంశెట్టి గోపాల్ ఒక సుదీర్ఘ వివరణ పంపాడు. తాను పుట్టుకతో బికారిని కాదని స్వతహాగా ధనవంతుడనని ఆ వివరణలో పేర్కొన్నాడు. నెల్లూరు సిటీ ఫైనాన్స్ ద్వారా ప్రజల నుంచి కోటి, మద్రాసు సిటీ ఫైనాన్స్ ద్వారా మూడు కోట్ల రూపాయలు వసూలు చేశామని చెప్పాడు.

తమ సంస్థ లావాదేవీల్లో భాగంగా 50లక్షల రూపాయల షేర్లు కొన్నామని, మద్రాసులో 26లక్షల రూపాయల భవనం కొనుగోలు చేశామని, కోటి రూపాయలు రొయ్యలసాగుకు మళ్లించి నష్టపోయామని చెప్పాడు. తాను దొంగను కాదని, గౌరవప్రదమైన కుటుంబం నుంచి వచ్చానని ఎక్కడకు పారిపోలేదని కూడా వివరణ ఇచ్చుకున్నాడు. వ్యక్తి గత కక్ష సాధింపుగా తనపై జమీన్‌రైతు పత్రికలో అభాండాలు వేశారని బాధపడి పోయాడు. ఇది ఆయన ఆవేదనా పూరితమైన వ్యధాభరిత నివేదన.

సిటీ ఫైనాన్స్ కంపెనీలో 10వేలు కట్టిన డిపాజిటర్లకు రెట్టింపు మొత్తం అంటే 20వేల రూపాయలు చెల్లిస్తామంటేనే, వేలాది మంది పేదవాళ్లు, మధ్యతరగతి ప్రజలు ఆశపడి నమ్మి డబ్బులు కట్టారన్న మాట వాస్తవం. ప్రజలకు లేనిపోని మాటలు చెప్పి, అందమైన బ్రోచర్లు ప్రింట్ చేసి నాలుగు కోట్లు దండుకున్న వాళ్లు, ప్రజలకు న్యాయంగా ఎనిమిదికోట్లు చెల్లించాలి. ప్రజలు తమ వద్ద దాచుకున్న డబ్బును రొయ్యలు తినేశాయనో, చేపలు మింగేశాయనో, షేర్లు కొని నష్టపోయామనో, బీర్లు తాగి మర్చిపోయామనో చెబితే అది ప్రజల కనవసరం. నీతి, నిజాయితీగల వాళ్లయితే, కక్కిన కూటికి ఆశపడని పెద్ద మనుషులయితే న్యాయంగా ఇస్తానన్న 20వేల రూపాయలు ఇవ్వకుండా, మేం నిజాయితీపరులం అని చెపితే వినేవాళ్లు ఎవరూ లేరు. సిటీఫైనాన్స్‌లో బినామీ రుణాల సంగతి మాత్రం గోపాల్ గారు ప్రస్తావించనే లేదు. కడుపుచించుకుంటే కాళ్ల మీద పడుతుంది కదా? తన ఆఫీసులో పని చేసే గుమస్తాలకు, నెలకు 800 రూపాయలు జీతం కూడా రాని బడుగు జీవులకు 61 లక్షల రూపాయలు రుణాలు ఎందుకిచ్చారో ఎవరు వాటిని స్వాహా చేశారో, వాటికి తన సంస్థ వద్ద వున్న సెక్యూరిటీ ఏమిటో, వాటిని రికవరీ చేసేందుకు చేసిన ప్రయత్నాలు ఏమిటో ఆయన ప్రజలకు తెలియజేస్తే బాగుంటుంది.

సిటీఫైనాన్స్‌లో తన తాబేదార్లయిన పార్టనర్‌లు పి.జయరామ్ పేరుతో 38లక్షలు, కె.రాధాకృష్ణయ్య, ఆయన కుటుంబ సభ్యుల పేర్లతో 46 లక్షలు, ఇలా తిలా పాపం తలా పిడికెడు అన్న విధంగా, కంచే చేను మేసినట్లు భాగస్తులే, గజదొంగలై కోట్లు దోచేసిన డబ్బులు ఇవ్వాలి. రుణాలు తీసుకున్న వారు సకాలంలో చెల్లించక పోతే, కోర్టు ద్వారా రాబట్టుకునే ప్రయత్నం చెయాలి. కాని, ఆ దిశగా కనీసం ఒక్క ప్రయత్నం కూడా చేయలేదు. తనతోపాటు ఇతర భాగస్తులు కూడా స్వంతంగానూ, కుటుంబ సభ్యులు, స్నేహితులు, బినామీ పేర్లతో తీసుకున్న కోట్ల రూపాయలను కట్టించే ప్రయత్నం చేయలేదు. అదేదో వాళ్ల తాతముత్తాతల వారసత్వ ఆస్తి మాదిరి అనుభవించారు. కాలం తీరిన ప్రామిసరీ నోట్లను కూడా తిరిగి రాయించుకోలేదంటే, సంస్థ నిర్వాహకుల నిర్లక్ష్య వైఖరికి, ఇంతకంటే నిదర్శనం ఏం కావాలి? తేరగా వచ్చిన ప్రజల డబ్బును దొరగా తిందామన్న దురద, దురుద్దేశం తప్ప, నమ్మి తమ వద్ద డబ్బు కట్టిన వారికి న్యాయం చెయ్యాలన్న ఇంగిత జ్ఞానం లేని వాళ్లు

## సిటీ ఫైనాన్స్ చీటింగ్‌పై నిర్వాహకుడి 'కహానీ'

వైనం మాత్రం గోపాల్ వివరణలో లేదు. సిటీ ఫైనాన్స్ స్కీమ్‌లో డిపాజిటర్లకు బహుమతుల కింద ఒక కోటి మూడు లక్షల రూపాయలు చెల్లించామని కూడా ఘనంగా చెప్పుకున్నారు. ఇందులో 20 లక్షలు కుంభకోణం జరిగిందని, ఆ సంస్థ భాగస్తులే జుట్లు పట్టుకొని కొట్టుకొని, వీధినపడ్డ విషయం అందరికీ తెలిసిందే. బహుమతుల స్కీమ్‌ను కూడా డిపాజిటర్ల చెల్లింపుల కిందనే జమకట్టిన వైనం, వారి మోసాన్ని స్పష్టంగా బయట పెడుతుంది.

సిటీ ఫైనాన్స్‌కు గాదంశెట్టి గోపాల్ మేనేజింగ్ పార్టనర్. భాగస్తులందరూ ఆయన్ని నమ్మి నాలుగు కోట్ల రూపాయలు ఆయన ఆధీనంలో ఉంచారు. సంస్థను సక్రమ మార్గంలో నడిపి న్యాయం చేయమని వేలకు వేలు నెల, నెలా జీతం రూపంలో ఇచ్చారు. సంస్థ తరఫున ఇతరులకు రుణాలు ఇచ్చే సమయంలో సరైన సెక్యూరిటీలు, ష్యూరిటీలు తీసుకున్న తర్వాతనే మోసగాళ్లు, దొంగలు అని పిలవక, దొరబాబులని పిలుస్తారా? ప్రజల డబ్బు కోట్లకు కోట్లు కుప్పలు తెప్పలుగా వచ్చి పడిందని, గాదెకింద పందికొక్కుల్లా, రాబందుల్లా పడి భాగస్తులే బినామీ పేర్లతో ముప్పాతిక భాగం సొమ్మును తిని, ఫైనాన్స్ సంస్థకు ఉత్తకళేబరాన్ని మిగిల్చి, ఇప్పుడు తామేదో పతివ్రతా శిరోమణులమని, పావనగంగా మూర్తులమని చెప్పుకొంటే వినేవాళ్లెవరూ ఉండరు.

సిటీ ఫైనాన్స్‌లో డిపాజిట్లు తిరిగి తీసుకున్న వారెవరికీ ఆ సంస్థ స్వచ్ఛందంగా డబ్బులు చెల్లించలేదు. సంస్థలో పరువు కోసం పాకులాడే పార్టనర్లు సమాజానికి భయపడి డిపాజిటర్ల కాళ్లా వేళ్లాపడి 10వేలు సమర్పించుకొని చిన్న కుండి పోయారు. సిటీ ఫైనాన్స్ మీద ఇప్పటికీ వివిధ కోర్టులలోనూ, వినియోగదారుల ఫోరంలోనూ ఎన్నో కేసులు పెండింగ్‌లో వున్నాయి. కొంత మంది

తరువాయి 7వ పేజీలో

# చంద్రబాబుదే సరైనదారి!

అయోధ్య రామాలయం విషయంలో ప్రధాని వాజ్‌పాయి సృష్టించిన రభస ఇంకా కొనసాగటం అసహ్యంగా, జుగుప్సాకరంగా వుంది. కేంద్ర ప్రభుత్వ ఏకైక కర్తవ్యం రామాలయ నిర్మాణం అయినట్లు; ప్రతిపక్షానికి వున్న ఒకే ఒక బాధ్యత దాన్ని అడ్డుకోవడమైనట్లు వ్యవహరిస్తున్నారు జాతీయ నేతలందరూ! పార్లమెంట్‌లో పక్షం రోజులుగా వేరే పనే లేదు. ప్రజలేమనుకొంటారోననే ఇంగిత జ్ఞానం లేకుండా మాట్లాడుతున్నారు వీరు. ఈ విషయంలో మన ముఖ్యమంత్రి అవలంభిస్తున్న వైఖరి ఒక్కటే సమంజసంగా కన్పిస్తున్నది. దేశంలో మరే సమస్యలూ లేనట్లు మందిరం - మసీదు వివాదంతో కాలక్షేపం చేయడం గర్హనీయమని తన నిరసన వ్యక్తం చేయడం ద్వారా చంద్రబాబు తతిమా రాజకీయ పక్షాలన్నిటికి బుద్ధి చెప్పాడు.

అయోధ్య మందిరం కేసు సుప్రీంకోర్టులో పెండింగ్‌లో వుంది. మసీదు కట్టాలో, మందిరం కట్టాలో, అసలేదీ కట్టకుండా వదిలేయాలో సుప్రీంకోర్టు తీర్పు చెప్పవలసి వుంది. మరొక ప్రక్క బాబ్రీ మసీదు కూల్చివేతపై ప్రత్యేక న్యాయస్థానం విచారణ జరుపుతున్నది. కూల్చివేత నేరంలో పాలుపంచుకున్న వారిపై ఛార్జిషీటు దాఖలు చేసే విషయంలో మరొక కేసు హైకోర్టు పరిశీలనలో వుంది. ఇవికాక, ఈ సంఘటనలపై జస్టిస్ లిబర్‌హాన్ న్యాయవిచారణ జరుపుతున్నారు. ఇన్ని రకాల న్యాయ వివాదాలలో చిక్కుకొన్న అంశంపై ప్రధానమంత్రి, ఇతర కేంద్ర మంత్రులు బాహాటంగా ప్రకటనలు చేయడం; పార్లమెంట్‌లో చర్చ జరపడం ఎంతటి దుర్మార్గ చర్య? ప్రభుత్వాధినేతలు చేసే ప్రకటనలు న్యాయస్థానాలు ఇచ్చే తీర్పులను ప్రభావితం చేసే ప్రమాదం వుందని తెలిసీ; కోర్టులలో నేరస్తులుగా విచారణ ఎదుర్కొంటున్న వారు ఆయా కేసులలో నిర్దోషులని ప్రకటించడం కోర్టు ధిక్కార నేరమౌతుందని కూడా తెలిసి మరీ ప్రధానమంత్రి వాజ్‌పాయి ఇట్లా మాట్లాడడం హేయమైన విషయం.

తాను బరితెగించి ప్రవర్తించడమే కాదు, తమ పార్టీ వారి నోటికి తాళాలు విప్పేశాడు వాజ్‌పాయి. ఆర్ఎస్ఎస్ అధినేత సుదర్శన్, విహెచ్‌పి నేత అశోక్ సింఘాల్, కేంద్ర మంత్రిణి ఉమాభారతి రోజుకొక రకంగా మాట్లాడుతున్నారు. చివరకు ప్రభుత్వ నౌకరి చేసుకొనే ఇండియన్ హిస్టరీ కౌన్సిల్ ఛైర్మన్ సైతం అయోధ్యపై కొత్త కొత్త వాదనలు విన్పిస్తున్నాడు. మసీదును బాంబులతో కూలగొట్టారని ఒకరంటే; కాదు - వట్టి చేతులతో కూల్చామని ఇంకొకరు చెప్తున్నారు. అసలక్కడ మసీదే లేదని, తాము నిర్మూలించింది రామమందిరం మాత్రమేనని మరొక పెద్దమనిషి సెలవిచ్చాడు. ఈ నిర్మూలన జరిపింది ముస్లింలు - మీకు తెలుసా? అని ఇంకొక ప్రబుద్ధుడు జనాన్ని వెర్రి వాజమ్మలను చేయ చూస్తున్నాడు.

అసలిప్పుడు ఈ రభస అంతా ఎందుకు? ఏ సందర్భం, సంఘటన జరిగిందని మానుతున్న పుండును గెలుకుతున్నారు? వీరి ప్రకటనల వల్ల సమస్య పరిష్కారం జరిగే అవకాశమే లేదు. అది కోర్టు తీర్పు ద్వారానే సాధ్యం. ఆ తీర్పు ఎట్లా వుంటుందో, దానికి వివిధ వర్గాల ప్రతిస్పందన ఏ తీరులో వస్తుందో వూహించడం కూడా వీలుకాని సమయం ఇది. ఇప్పుడా రభస ఉభయ మతాలలోని ఛాందసవాదులు పెట్రేగి పోవడానికి ప్రేరణ అవుతుంది; మతకల్లోలాలు చెలరేగే ప్రమాదం ఏర్పడుతుంది. అది దేశానికి, సమాజానికి, ప్రజలకు ఎంత అనర్థదాయకమో వివరించి చెప్పనవసరం లేదు.

మీరు చెప్తున్నది, మాట్లాడుతున్నది తప్పు అని చంద్రబాబు, కరుణానిధి, మమతా బెనర్జీ వంటి మిత్రపక్షాల నేతలు ప్రధానికి సలహా ఇస్తే - మిత్రులైన వారు తమ తమ పరిధులలో వుండడం అవసరమని, మర్యాద తప్పి మాట్లాడితే సహించనని బెదరించాడు వాజ్‌పాయి. ఆయన మనసులో, ఆయన పార్టీ ఆలోచన లలో ఏదో పెద్ద కుట్ర వుందా అన్న సందేహం కలుగుతున్నది ఈ ధోరణి చూస్తుంటే. ఇప్పట్లో ఎన్నిక లకు ఏ పార్టీ సిద్ధంగా లేదు కాబట్టి, తమ ప్రభుత్వానికి ఢోకా లేని వాతావరణంలోనే అయోధ్య వివాదాన్ని తమకు నచ్చిన రీతిలో పరిష్కారాన్ని బలవంతంగా అమలు చేయాలనే కుత్సిత బుద్ధితో ఈ గందరగోళం కల్పిస్తున్నారనే సందేహం కలుగుతున్నది. అదే నిజమైతే మాత్రం దేశంలో అరాచకం తాండవించడం ఖాయం. మిత్ర పక్షాల నేతలు తమకు అధికారం ముఖ్యమో లేక దేశశ్రేయస్సు అవసరమో తేల్చుకోవలసిన సమయం ఇంకెంతో దూరంలో లేదు.

నిజానికి కేంద్ర ప్రభుత్వం కాని, ప్రతిపక్షాలు కాని, మిత్ర పక్షాలు కాని ఇప్పుడు కృషి చేయవలసింది రైతాంగం, చిన్న పరిశ్రమల యజమానులు ఎదుర్కొంటున్న విపత్కర పరిస్థితులను నివారించడానికి మార్గాన్వేషణ కోసం! డబ్ల్యుటిఒ ఒప్పందం వల్ల దేశ ఆర్థిక వ్యవస్థ కుప్పకూలిపోయే ప్రమాదం కన్పిస్తున్నది. నిరుద్యోగం, పేదరికం, ఆకలిచావులు, కార్మిక అశాంతి, యువతరంలో నిరాశా నిస్పృహలు ప్రబలిపోతున్నాయి. రాజకీయ విభేధాలు విస్మరించి, ఇతర సమస్యలన్నీ ప్రక్కకునెట్టి ఈ ఆర్థిక సంక్షోభ నివారణకు సమష్టిగా కృషి చేయవలసిన తరుణంలో మతం పేరుతో సమాజంలో చీలికలు తెచ్చి, ప్రజల మధ్య విద్వేషాలు రెచ్చగొట్టే కుట్ర పన్నడం దేశద్రోహ నేరం! దీన్ని అడ్డుకోవడానికి చంద్రబాబు వంటి నేతలతో యావత్ మేధావి వర్గం జతకలవడం అవసరం. *

## 50 ఏళ్ల క్రితం ఈ నాడు

జమీన్‌రైతు
22-12-1950
పేజీలు:12 వెల: 0-3-0

### ఆంధ్ర రాష్ట్ర మహిళా సభ

ఈ నెల 29, 30తేదులందు నెల్లూరులో జరుగును. ఇండియా పార్లమెంటు సభ్యురాలు శ్రీమతి జి. దుర్గాబాయి ఎం.ఎ.బి.ఎల్., గారు అధ్యక్షత వహిస్తారు. పార్లమెంటులో హైదరాబాదు సభ్యురాలు శ్రీమతి పద్మజ నాయుడుగారు ప్రారంభోత్సవం చేస్తారు. ఆంధ్ర రాష్ట్ర మహిళా సభలు ఈ నెలాఖరున జరుగునని ఇదివరలో ప్రకటించాము. ఆ ప్రకారం 29, 30తేదీలలో జరుగును. ఈ సభలు ఇంత వరకు ఇక్కడ జరుగలేదు. మరియు ఇటు రాయలసీమ, అటు ఉత్తర సర్కార్లకును అందుబాటులో సమంగా సౌకర్యంగా వుండుననియు ఇంకను కొన్ని కారణాంతరాల చేతను ఈ తరుణంలో సభలు ఇక్కడ జరుపుట సముచితమని కోరినారు. ఈ సావకాశం మాకు కలిగినందుకు మిక్కిలి సంతోషిస్తున్నాము.

ఆహ్వానసంఘం

### చేనేత కార్మికుల ఆకలియాత్ర

10-12-50తేది పరిశ్రమల మంత్రి పెరుమాళ్లస్వామి రెడ్డియార్ గూడూరుకు వచ్చిన సంధర్భంలో, జిల్లాలోని దాదాపు 7,8 వందల చేనేత కార్మికులు ఆకలియాత్ర సాగించి, నూలుకొరత వల్ల ఎన్ని కుటుంబాలు నిరుద్యోగులై, తిండిలేక అలమటిస్తున్నవో సాదృశ్యంగా చెప్పుకొన్నారు.

### సర్దార్ అంతిమయాత్ర

సర్దార్‌పటేల్ అమరచరితం తప్ప, అయన భౌతికమూర్తి ఇక మన మధ్యలేదు. జవహర్ చెప్పినట్లు 15తేది 9.37తో మహోజ్వల చరిత్రతో కూడిన ఒక మహావ్యక్తి జీవితగాధ సమాప్తి చెందింది.

సర్దార్ మరణవార్త ప్రపంచ మంతా ప్రళయచిచ్చులాగా ఒక్క క్షణంలో ఎగప్రాకి పోయింది. భారత భూమి పిడుగులాంటి ఈ వార్తతో నిలువునా క్రుంగిపోయింది.

అన్ని రాష్ట్రాలలోని ఆయన అనుచరులు గాఢ సంతాపంలో మునిగి పొయ్యారు. రెక్కలు గట్టుకొని తమ నాయకుని కళేబరాన్నయినా కడసారి చూచి, ఆయన అంతిమ యాత్రకు భక్తి పురస్సరపు వీడ్కోలిచ్చుటకు బొంబాయిలో వాలారు. బొంబాయి విమానాశ్రయం రోదించింది.

మొట్టమొదటగా మధ్య పరగణాల గవర్నర్ పక్వాసా దిగారు. తర్వాత మౌలాంకర్, బిర్లాలు ఢిల్లీ

తరువ 10వ పేజీలో

## జనవాణి

# విద్యాకమిటీలకు 'రౌడీల' పెత్తనమా?

ప్రభుత్వం ఏర్పాటు చేస్తున్న విద్యా కమిటీల్లో కొన్ని చోట్ల రౌడీలు, ముఠా నాయకులు ఎన్నికైనట్లు పత్రికల్లో వార్తలొచ్చాయి. ఇటువంటి వారు పసి పిల్లలను అక్షరాస్యులను చేసే కమిటీలకు ఎన్నికైతే సమాజం ఏం బాగుపడుతుందన్నది ప్రశ్న. ఇప్పటికే సమాజం నానా రకాల రుగ్మతలతో సతమతమవుతుంది. గ్రామ స్థాయిలో విద్యా రంగాన్ని సైతం భ్రష్టుపట్టించే పోకడలు మంచికి కావు. ఎటువంటి నేరచరిత, అక్రమార్జన, ఆరోపణలు లేని వ్యక్తులకే ఇటువంటి కమిటీలకు పోటీచేసేందుకు అనర్హులుగా ప్రకటించి వుంటే బాగుండేది.

నెల్లూరు వి.సుధామయి

### అయోధ్య వివాదంపై ఎవరూ మాట్లాడకూడదు

అయోధ్యలో వివాదాస్పద కట్టడం కూల్చివేతకు సంబంధించి ఇటీవల వస్తున్న రకరకాల ప్రకటనలు దేశప్రజలను గందరగోళ పర్చేవిధంగా వున్నాయి. వివాదాస్పద కట్టడం బాంబు పేలిదానంతట అదే కూలిపోయిందని ఇందులో కరసేవకుల ప్రమేయం ఏదీ లేదని ఆర్ఎస్ఎస్ చీఫ్ సుదర్శన్ ప్రకటించారు. అసలు కూల్చింది మందిరాన్నేకాని మసీదును కాదని విశ్వహిందూ పరిషత్ నాయకులు చెబుతున్నారు. ఈ ప్రకటలన్నీ దేశ ప్రజలను అత్యంత గందరగోళంలో పడేస్తున్నాయి. అయోధ్యలో వివాదాస్పద కట్టడం కూల్చివేతకు సంబంధించి కానీ కట్టడం పునరుద్ధరణకు సంబంధించికానీ సుప్రీంకోర్టుతీర్పు వెలువరించే వరకు ఏ రాజకీయ పక్షం ప్రకటనలు చేయకుండా నిషేధం విధిస్తే బాగుంటుంది.

నెల్లూరు వి.రఘు

### రైతులను ఆదుకోవాలి

దేశానికి ధాన్యాగారమనబడే ఆంధ్ర ప్రదేశ్‌లోని ధాన్యం పండించే రైతులను త్వరగా ఆదుకోండని, పంజాబ్ రైతులకు ఇస్తున్న సహకారాన్ని, రాయితీలను రాష్ట్ర రైతులకివ్వమని రాష్ట్ర ప్రభుత్వం ఎన్నో రోజులుగా కేంద్ర ప్రభుత్వాన్ని అభ్యర్థి

తరువ 10వ పేజీలో

# సానికొంపల్లో పసితనం ఖతం!

నెల్లూరు టౌన్‌లో హైక్లాస్ వ్యభిచారం మూడుకార్లు ఆరు బార్లుగా వర్ధిల్లుతోంది. సర్వ సబ్బందు సౌక్యాలను వ్యభిచార గృహ యజమానులే సమకూరుస్తున్నారు. కొంత మంది రాజకీయ నాయకులు, అధికారుల ప్రోత్సాహంతో జాణలు, పలువురు మహిళలను వివిధ రకాల ప్రలోభాలకు గురిచేసి ఈ నరక కూపంలో

## అడ్డూ ఆపులేని దురాచారం కోరల్లో నెల్లూరు

దింపుతున్నారు. పని ప్రాయం వీడని బాలికలు కూడా కామదేన్ల దాహానికి బలి అవుతున్నారు. టౌన్‌లోని బాలాజీ నగర్, వేదాయపాళెం, భక్తవత్సలనగర్, పోస్టల్‌కాలనీ, నవాబుపేట, వెంకటేశ్వర పురం, రామ్మూర్తినగర్, హరనాథపురం ప్రాంతాల్లో హైక్లాస్ వ్యభిచారం జోరుగా సాగుతుంది. నెలకు 10వేల రూపాయల బాడుగ ఇళ్లలో ఈ దురాచారం దర్జాగా సాగుతోంది. బాలాజీనగర్ పాలబూత్ సెంటర్‌లో ఇటీవల పోలీసులు అరెస్టు చేసిన సుశీలను చూస్తే పరమదైవభక్తు రాలిగా, పక్కా సంసారిగా కనిపిస్తుంది. కాలేజీ యువతులను వ్యభిచారం వైపు మళ్లించడంలో సుశీలది అందవేసిన చేయి. మాటలతో కాలేజీ అమ్మాయిలను బుట్టలో వేసుకొని ముందు వారికి కావాల్సిన వస్తువులన్నీ తీసిపెట్టి ఆ తర్వాత తన అప్పు తీర్చమని పట్టుపట్టి అభం, శుభం తెలియని అమ్మాయిలను ఈ పాపపు పనిలోకి దింపుతుంది. బాలాజీనగర్‌లోని ఈమె వుండే గృహాన్ని చూస్తే ఆశ్చర్యపోవాల్సిందే. సెల్ ఫోన్ హిదనే బుకింగ్‌లు చేస్తుందట. పలువురు అధికారులు నివాసముండే పోస్టల్ కాలనీలో ఓ పెద్ద భవంతిలో కొలువు తీరిన అక్కా చెల్లెళ్లు నడిపే వ్యభిచార గృహానికి ఓ పెద్ద తెలుగునేత కాపలా దారుడు. ఈ తెలుగు జాణలు

తొరవ 11వ పేజీలో

# రైతుసమస్యలపై రాజీలేని పోరు

తెలుగుదేశం పార్టీ అవలంభిస్తున్న రైతాంగ వ్యతిరేక విధానాలపై రైతులను జాగృతపర్చే కార్యక్రమాన్ని కాంగ్రెస్ పార్టీ చేపడుతుందని జిల్లా కాంగ్రెస్ అధ్యక్షుడు, సి.వి.శేషారెడ్డి చెప్పారు. 21తేది ఇందిరా భవన్‌లో విలేఖరులతో మాట్లాడారు. చంద్రబాబు నాయుడు అవలంభిస్తున్న అస్తవ్యస్త విధానాల వల్ల రైతులు

## నెల్లూరుసంగతులు

పండించిన పంటకు గిట్టుబాటు ధర లేదు. ప్రస్తుతం పంటలు పండించను సాగునీరు లేదు. బావుల ద్వారా, బోర్ల ద్వారా వ్యవసాయం చేద్దామంటే విద్యుత్‌ను కూడా ప్రభుత్వం సరిగ్గా అందివ్వ లేకపోతున్నట్లు చెప్పారు. కేంద్రంతో రాజీలేని పోరాటం చేస్తామని ముఖ్యమంత్రి డంబాలు పలుకుతాడు. వాస్తవంగా వాజ్‌పాయితో తన పార్టీ ఎమ్పీలను క్రికెట్ మ్యాచ్‌లో ఫిక్సింగ్ చేసినట్లు ఒక ఒప్పందాన్ని కుదుర్చు కున్నాడు. విపత్కర పరిస్థితుల్లో సైతం రైతులు పండించే పంటలపై ప్రభుత్వం 10శాతం పన్ను విధించడం దారుణం. ప్రతి విషయంలో రాష్ట్రాన్ని పంజాబ్‌తో పోలుస్తాడు. పంజాబ్‌లో పండిన పంటను 70శాతం అక్కడి రాష్ట్ర ప్రభుత్వం కొనుగోలు చేస్తుంది. ఇక్కడ ఆ విధానం లేదు. ధాన్యం కొనుగోలు చేయని సాకును ఎఫ్‌సిఐపై నెట్టి సరిపుచ్చుకొంటే ఎలానన్నారు. కోట్ల విజయభాస్కరరెడ్డి, ఎన్టీరామారావు ముఖ్యమంత్రులుగా వుండగా ధాన్యానికి గిట్టుబాటు ధర లేనప్పుడు సివిల్ సప్లయిస్ ద్వారా 1000 కోట్ల మేర కొనుగోలు చేయించినట్లు చెప్పారు. గత జన్మభూమిలో విద్యుత్ కనెక్షన్లు ఇస్తామని విపరీతంగా డిపాజిట్లు వసూలు చేశారు. ఇప్పటికి ఒక్క కొత్త మీటరు ఇవ్వలేదు. జనవరి 2తేదీ నుంచి 8తేది వరకు జరిగే జన్మభూమి కార్యక్రమంలో రైతాంగ సమస్యలపై గ్రామ గ్రామాన ప్రజలు,

తొరవ 7వ పేజీలో





రైతుబజారులో కూరగాయలు అమ్ముతున్న ఎమ్మెల్యే వివేకానందరెడ్డి, నిలబడి ఈ వ్యవహారం చూస్తున్నవారు వైస్ ఛైర్మన్ సందానీ బాషా, కౌన్సిలర్లు.

# బంగారు బాతుగుడ్లు - బెల్ట్‌షాపులు

## ఎ.సి.కి 5 లక్షలు, ఎస్.ఐ.కి 70 వేలు నెల మామూళ్ల సమర్పణం!

బ్రాందీ షాపులకు అనుబంధంగా వుండే బెల్ట్ షాపులను ఎక్సైజ్ సిబ్బంది పెంచిపోషిస్తూ లక్షాధికారులవుతున్నారు. జిల్లా వ్యాప్తంగా అధికారికంగా 325 బ్రాందీ షాపులుంటే, అనధికారికంగా నాలుగు వేలకు పైగా బెల్ట్ షాపులు న్నాయి. జిల్లాలో వున్న గ్రామాలకు నాలుగింతలుగా బెల్ట్ షాపులున్నట్లు లెక్క. కుగ్రామాలలో సైతం రెండు, మూడు బెల్ట్ షాపులుండటంతో గ్రామీణ ప్రాంతాల్లో గతంలో సారా కన్నా సులువుగా బ్రాందీ దొరుకుతుంది. పొద్దస్తమానం కూలీ, నాలీ చేసుకొని సంపాదించిన డబ్బును ప్రజలు బెల్ట్ షాపుల్లోని బ్రాందీ సీసాలకు తగలేస్తున్నారు.

బెల్ట్ షాపులు తమకు బంగారు గుడ్లు పెట్టే బాతులు కావడంతో ఎక్సైజ్ శాఖాధికారులు వీటి ఏర్పాటు చట్ట విరుద్ధమైన వీటిని గూర్చి పట్టించుకోవడం లేదు. మీ ఇష్టం వచ్చినట్లు వ్యాపారం చేసుకోండి; నెల నెలా తమ మామూళ్లు పారెయ్యమని ఎక్సైజ్ శాఖాధికారులు బ్రాందీ షాపుల వారిని కోరుతున్నారు. నెలకు ఒక్కొక్క బ్రాందీ షాపు వద్ద నుంచి రకరకాల మామూళ్ల పేర ఎక్సైజ్ శాఖాధికారులు 15వేల రూపాయలకు తగ్గకుండా వసూలు చేస్తున్నారు. ఈ విధంగా వసూలయ్యే 45లక్షల్లో జిల్లా ఎక్సైజ్ సూపరింటెండెంట్ నెలకు ఆరు లక్షల రూపాయలు తన వాటాగా తీసుకొంటున్నారు. సర్కిల్ ఇన్స్‌పెక్టర్ రేంజ్‌ను బట్టి లక్ష రూపాయల నుండి లక్షన్నర వరకిస్తారు. సబ్‌ఇన్స్‌పెక్టర్లకు ఎంత తక్కువనుకొన్నా 70వేల రూపాయల వరకు ముడుతుంది. ఒంగోలు కేంద్రంగా వున్న ఎక్సైజ్ అసిస్టెంటు కమీషనర్‌కు నెలకు నెల్లూరు జిల్లా వాటాగా 5లక్షల 20వేల రూపాయలు ఎక్సైజ్ ఆఫీసు నుంచి వెళ్తుంది. ఇటీవల నెల్లూరు జిల్లా ఎక్సైజ్ సూపరింటెండెంటుగా బాధ్యతలు తీసుకొన్న పెద్ద మనిషి 20లక్షల రూపాయలు పై అధికారులకు చెల్లించి ఈ పోస్టును కొనుగోలు చేసుకొని ఇక్కడకు వచ్చారట.

జిల్లాలో బ్రహ్మాండంగా మద్యం అమ్మిస్తేగాని తమకు రావాల్సిన మామూళ్ల మొత్తం రాదని నరసింహకొండ వద్ద వున్న ఎపిబిసిఎల్ డిపో నుంచి

తొరవ 11వ పేజీలో

# సమసిన సంక్షోభం-ప్రజాదర్బార్ ప్రశాంతం

ప్రజాదర్బార్ నిర్వహణ విషయమై జిల్లా కలెక్టర్ ప్రవీణ్‌కుమార్‌కు, రెవిన్యూ అసోసియేషన్‌కు మధ్య రేగిన వివాదానికి సోమవారం తెరపడింది. అధికార యంత్రాంగంలో పెద్ద సంక్షోభం తప్పిపోయింది. జిల్లా కలెక్టర్, రెవిన్యూ సంఘాల వారికి మధ్య రెండు విడతలుగా జరిగిన చర్చల ఫలితంగా సంతృప్తి చెందిన ఎమ్మార్వోలు 18తేది జరిగిన ప్రజాదర్బార్‌కు చివరిక్షణంలో హాజరయ్యారు. ప్రజాదర్బార్ కార్యక్రమంలో ప్రజల సమక్షంలో కలెక్టర్ తమను ఇష్టమొచ్చినట్లు మాట్లాడుతున్నారని, బహిరంగ నిరసన తెలిపిన రెవిన్యూ అసోసియేషన్ నాయకులు, ఎమ్మార్వోలు ఇకపై ప్రజాదర్బార్‌ను బహిష్కరిస్తున్నట్లు ప్రకటించారు. గత నెలలో జరిగిన ప్రజాదర్బార్‌లో జిల్లా కలెక్టర్, అల్లూరు, కోవూరు, తోటపల్లిగూడూరు ఎమ్మార్వోలను ప్రజల సమక్షంలో మందలించి వారి ధోరణి మార్చుకో మన్నారు. దీంతో కినుక వహించిన ఎమ్మార్వోలు రెవిన్యూ అసోసియేషన్‌తో ఏకమై కలెక్టర్‌పై యుద్ధభేరి మ్రోగించారు. ప్రజాదర్బార్‌కు ఎమ్మార్వోలు ఇకపై హాజరుకారని, నిర్ణీత వేళల్లో విధులు నిర్వహిస్తారని, రెవిన్యూకు సంబంధం కాని పనుల్లో జోక్యం చేసుకొనేది లేదని ప్రకటించారు. ఈ నేపథ్యంలో 18తేది జరిగిన ప్రజాదర్బార్‌ను ఎమ్మార్వోలు బహిష్కరించారు. జిల్లా కలెక్టర్ ఆదేశం మేరకు జిల్లా రెవిన్యూ అధికారి వెంకటేశ్వర్లు రెవిన్యూ అసోసియేషన్ నాయకులను చర్చలకు ఆహ్వానించగా ఉదయం,

## కలెక్టర్-ఎమ్మార్వోల వ్యవహారం

సాయంత్రం రెండు విడతలుగా చర్చలు జరిగాయి. చర్చలు ముగిశాక సాయంత్రం 4.50 నిముషాలకు ఎమ్మార్వోలు ప్రజాదర్బార్‌కు హాజరయ్యారు.

ఈ విషయమై జిల్లా కలెక్టర్ ప్రవీణ్‌కుమార్ మాట్లాడుతూ జిల్లా అభివృద్ధికి ప్రజాసంక్షేమానికి కట్టుబడి పనిచేయడం ముఖ్యమని ఇందుకోసం అధికారులు బాధ్యతగా పనిచేయక తప్పదన్నారు. ప్రజాదర్బార్‌లో ఇక నుండి అధికారులను నొప్పించే విధంగా తాను ప్రవర్తించనన్నారు. రెవిన్యూ అసోసియేషన్ నాయకులు మాట్లాడుతూ తమ డిమాండ్లన్నిటికి కలెక్టర్ సానుకూలంగా స్పందించినట్లు చెప్పారు. సాయంత్రం ఐదుగంటల తర్వాత విధులు, సెలవు దినాల్లో బాధ్యతలు, రెవిన్యూ శాఖకు సంబంధంలేని పనుల్లో ఎమ్మార్వోలు పాల్గొనరన్నారు.

## ఇళ్లమంత్రి ఇఫ్తార్ విందు

రంజాన్ నెల ఉపవాస దీక్షలను పురస్కరించుకొని ఇళ్లమంత్రి ఆధాల ప్రభాకరరెడ్డి ముస్లింలకు 18తేది ఇఫ్తార్ విందు నిచ్చారు. కోటమిట్టలోని షాదీమంజిల్‌లో జరిగిన ఈ విందుకు వందలాది మంది హాజరయ్యారు. ఖాజీలు, ఖాజీలు, వస్తాదుల సమక్షంలో ఇస్లాం పద్ధతులకు విరుద్ధంగా నేతలు 'సెక్యులరిజం మార్కు టోపీలు' ధరించి నమాజు చేశారు. వుజు, నియ్యత్ లేకుండా వీరందరిచేత నమాజులు చదివించి కొందరు మైనార్టీ నేతలు సిగ్గులేకుండా భుజాలెగుర వేశారు. విందుకు ఎమ్మెల్యేలు వివేకానందరెడ్డి, విజయరామిరెడ్డి, దుర్గాప్రసాద్, కలెక్టర్ ప్రవీణ్‌కుమార్‌రెడ్డి,

తొరవ 11వ పేజీలో

# డిసిసి వద్దు-జడ్పీ అయితే ముద్దు

తనను జిల్లా పరిషత్ ఛైర్మన్ పదవికి పోటీ చేయను ఎంపిక చేస్తే తప్పక పోటీ చేస్తానని ఉదయగిరి కాంగ్రెస్ నాయకుడు మేకపాటి చంద్ర శేఖర్‌రెడ్డి తన మనసులో మాట చెప్పారు. ఉదయగిరి మండలం గానుగపెంట పల్లెలో తన అనుచరుడి వివాహానికి హాజరైన చంద్రశేఖర్‌రెడ్డి 'జమీన్‌రైతు

**మేకపాటి**

విలేఖరి'తో ముచ్చటించారు. జిల్లా కాంగ్రెస్ అధ్యక్ష పదవిని స్వీకరించమని పలువురు వత్తిడి చేశారు. వ్యాపారాల్లో మునిగి తేలే నేను పార్టీ పదవికి న్యాయం చేయలేనని భావించాను. అన్ని ప్రాంతాలు, వర్గాల ప్రజలకు సేవ చేయాలంటే జడ్పీ ఛైర్మన్‌గా ఉంటేనే సాధ్యమవుతుంది. అప్పుడు వ్యాపారాలు కూడా మాని పూర్తి సమయం ప్రజాసేవకే వెచ్చిస్తానన్నారు. ఉదయగిరి ప్రాంతాన్ని అభివృద్ధి చేయాలనే ఆర్.ఆర్. ట్రస్టు ద్వారా ఇంజనీరింగ్ కాలేజిని ఏర్పాటు చేస్తున్నట్లు చెప్పారు. ఉదయగిరిలో డిగ్రీకాలేజి, కృష్ణాపురంలో సహోదయ పాఠశాల ఏర్పాటు కూడా తాము స్వంత నిధులు వెచ్చించిన విషయాన్ని చంద్రశేఖర్‌రెడ్డి ఈ సందర్భంగా గుర్తు చేశారు. తమకు కొత్తగా వచ్చిన ఇంజనీరింగ్ కాలేజిని వ్యాపార దృక్ప థంతో గాక సేవా దృక్పథంతో నడుపుతా మన్నారు.

## ఉదయగిరిలో కరవు పరిస్థితులు

ఉదయగిరి ప్రాంతంలో మును పెన్నడూ లేని రీతిలో కరవు పరిస్థితులు నెలకొనివున్నాయి. సాగు చేద్దామంటే చుక్కనీరు లేదు. వ్యవసాయ బావుల ఆధారంగా సాగుచేసిన వరిపంట విద్యుత్ కోత కారణంగా పంటకోత దశకు రాక ముందే పశువులకు ఆహారంగా పెట్టవలసి వస్తున్నదని రైతులు వాపోతున్నారు.

తొరవ 8వ పేజీలో

# రాక్షస వార్డెన్ వికృత చేష్టలు

ఉదయగిరిలో వెనుకబడిన తరగతుల సంక్షేమ బాలుర వసతి గృహంలోని వార్డెన్ ఎబినేజర్ విద్యార్థులను లైంగిక వేధింపులకు గురిచేసినట్లు పోలీసులు కేసు నమోదు చేశారు. ఎబినేజర్ పచ్చి తాగుబోతు. ప్రతిరాత్రి

## ఉదయగిరిలో ఘోరం, ఘోరం

ఒళ్లు తెలియకుండా తాగాక ఒక గదిలో నగ్నంగా కూర్చుని చుట్టూ విద్యార్థులను చేర్చుకొని లైంగిక చర్యలకు పాల్పడే వాడు. ఈ ప్రబుద్ధుడు ఆరుమాసాల క్రితం ఇక్కడకు బదిలీ అయ్యి వచ్చాడు. గతంలో పనిచేసిన 5చోట్ల వివిధ కారణాలతో సస్పెండ్ అయినట్లు తెలిసింది. వార్డెన్ దుశ్చర్యలు భరించలేక 30 మంది విద్యార్థులుండే హాస్టల్‌లో ప్రస్తుతం ఆరు మందే వున్నారు. విలేఖరులు హాస్టల్‌ను సందర్శించిన సమయంలో ఒక గదిలో మద్యం తాగుతూ ఈ వార్డెన్ కనపడ్డాడు. తమ దర్యాప్తులో వార్డెన్ విద్యార్థులపై లైంగిక వేధింపులకు పాల్పడినట్లు, నిత్యంతాగి విధులు నిర్వహిస్తున్నట్లు రుజువయ్యిందని ఉదయగిరి సిఐ శ్రీనివాసరావు చెప్పారు.

## టెలికాం సభ్యునిగా చెలికం శంకర్‌రెడ్డి

జిల్లా టెలికాం సలహా సంఘ సభ్యులుగా వెంకటగిరికి చెందిన చెలికం శంకర్‌రెడ్డి, అల్లం చంద్రమోహన్ నియమితులయ్యారు. మాజీ ముఖ్య

తొరవ 8వ పేజీలో

నెల్లూరు చేపల మార్కెట్ వద్ద క్లీన్ అండ్ గ్రీన్ కార్యక్రమంలో మొక్కను నాటుతున్న ఇళ్లమంత్రి ఆదాల ప్రభాకర రెడ్డి. ప్రక్కన జిల్లా కలెక్టర్ ప్రవీణ్‌కుమార్, ఎమ్మెల్యే వివేకానంద రెడ్డి, కౌన్సిలర్లు సురేష్, సల్మా, శ్రీధర కృష్ణారెడ్డి, సుధాకర్.

# రత్నమ్మ హత్యకేసు సి.ఐ.డి.కి

జిల్లా వ్యాప్తంగా సంచలనం కలిగించిన తమ్మిశెట్టి రత్నమ్మ హత్యకేసు దర్యాప్తు బాధ్యతను ప్రభుత్వం సిఐడికిఅప్పగించింది. హత్య జరిగి ఆరు నెలలు పూర్తయినా అసలు నిందితులను గుర్తించడంలో పోలీసులు విఫలమయ్యారు. రాజకీయ ప్రలోభాలకు తలొగ్గి కేసును పూర్తిగా తప్పుదారి పట్టించారని వివిధ ప్రజా సంఘాలు, మహిళా సంఘాలు ఆందోళన చేయడంతో కేసు విచారణను పోలీసుల నుండి తప్పించి సిఐడికి బదిలీచేశారు. ఈ మేరకు సిఐడి, డిఎస్పీ వివేకానందస్వామి ఆయన సిబ్బందితో కలిసి వచ్చి హత్య జరిగిన సంఘటనా స్థలాన్ని సందర్శించారు. మృతురాలి బంధుమిత్రుల తోపాటు, తొలుత అనుమానితులుగా ప్రచారం జరిగిన నలుగురిని కలిసి, విచారణ నిమిత్తం నెల్లూరు తరలి రావలసిందిగా కోరడంతో వారు డిఎస్పీ ఎదుట హాజరై విచారణకు సహకరించినట్లు తెలిసింది.

ఈ కేసుకు సంబంధించి తొలుత ఉదయగిరి సిఐ శ్రీనివాసులు దర్యాప్తు కొనసాగించి కొండ్రాజుపల్లెకు చెందిన వెంకటస్వామి, వెంకటయ్య, మాల్యాద్రి, కర్రోడు అనే వారిపై కేసు నమోదు చేశారు. తదుపరి సిఐ విచారణ ఏకపక్షంగా పక్షపాత ధోరణితో సాగిందని, అసలు నిందితులు బంధువులేకాగా, వారిని వదలి ప్రమేయం లేనివారిపై

**వివాదం సమసేనా?**

నేరం మోపాలని ప్రయత్నిస్తున్నారని ఆరోపణలు వెల్లువెత్తాయి. దీంతో కేసును సిఐ నుండి తప్పించి కావలి డిఎస్పీకి, అప్పటి ఎస్పీ సి.వి.నరసయ్య అప్పగించారు. డిఎస్పీ ఈ కేసును పరిశోధించి మృతురాలి రత్నమ్మ స్వంత బంధువులే ఈ హత్యకు పాల్పడినట్లు నిర్ధారించి కేసు నమోదు చేసి అందులో ఇద్దర్ని అరెస్ట్‌చేసి రిమాండ్‌కు పంపారు.

ఈ కేసులో ప్రధాన సాక్షిగా ఉన్న తిరుపతమ్మ రోజుకో రకంగా సాక్ష్యం చెప్తుండడంతో కేసు అనేక మలుపులు తిరిగింది. చివరకు సిబిఐ విచారణకు ఆదేశించాల్సి వచ్చింది. ఈ మేరకు సిబిడి అధికార్లు అన్ని కోణాల నుంచి దర్యాప్తుకు రంగం సిద్ధం చేస్తున్నారు. సిబిడి అధికార్లు, పోలీసు శాఖలోని వివిధ స్థాయిలలోని ఇద్దరు అధికార్లు చేసిన దర్యాప్తులో ఎవరు చేసిన దర్యాప్తు నిజమని తేలుస్తారో లేక, వీరిద్దరూ కాక మూడవ పార్టీ ప్రమేయంతో జరిగిందని తేలుస్తారో వేచి చూడాల్సిందే. వీరైనా నిష్పక్షపాతంగా దర్యాప్తు సాగించి అసలు నిందితులు ఎవరో గుర్తిస్తే ప్రజల అభినందనలు అందుకొంటారు.

## తరలిపోతున్న సున్నపుగుల్ల

పులికాట్ సరస్సు నుంచి తమిళ నాడుకు చెందిన కొందరు వ్యాపారస్తులు సున్నపు గుల్లను తీసి తరలిస్తున్నా పట్టించుకొనే నాధుడు కనిపించడం లేదు. సహజసిద్ధంగా ఏర్పడే సున్నపు గుల్లను తీసివేయడంతో సరస్సు గుంతల మయంగా మారుతుంది. ముఖ్యంగా వేనాడు, ఇరకం దీవుల సమీపంలో గుల్లను తీస్తుంటారు. తమిళనాడు

తొరవ 8వ పేజీలో

# జంట హత్యల నిందితుల అరెస్ట్

జిల్లాలో అత్యంత సంచలనం కలిగించిన బుచ్చిరెడ్డిపాళెం జంటహత్యలతో సంబంధం వున్న నిందితుల్ని ఎట్టకేలకు పోలీసులు అదుపులోకి తీసుకున్నారు. బుచ్చిరెడ్డిపాళెంలో గత ఏడాది ఫిబ్రవరి 28న పెద్దూరులో గల తల్లికొడుకులైన కృష్ణవేణమ్మ, సాయి ప్రసాదరెడ్డి హత్య జరిగిన సంగతి తెలిసిందే. అప్పటి ఎస్పీ నరసయ్య ధన దాహం వల్ల ఈ కేసు వీడని మిస్టరీలా ముగిసింది. అప్పట్లోనే ఈ కేసు విషయంలో పోలీసు అధికార్లకు లక్షలు ముట్టిందనే ప్రచారం వుంది. ప్రస్తుతం వున్న ఎస్పీ కరుకుదనంతో ఈ కేసు వెలుగు చూసింది. ఈ జంట హత్యలు జరిగిన తర్వాత నుంచే వారి బంధువులే ఈ ఘాతకానికి పాల్పడ్డారనేది స్థానికుల వాదన. ఈ నేపథ్యంలో వారి బంధువులు మృతిచెందిన వారి ఆస్తి కోసం పోట్లాడు కొనే సమయంలో కొత్త ఎస్పీ నిఘా పెంచడంతో నిందితులలో ఒకరైన దేగపూడి శ్రీనివాసులరెడ్డిని దొరికి పోయారు. హత్యలో భాగస్తులైన హజరత్‌రెడ్డి, సాయిబాబారెడ్డి పరారీలో వున్నారు. వీరంతా కృష్ణవేణమ్మకి మేనల్లుళ్లు, తమ్ముళ్లు కావడం విశేషం. హత్యానేరంలో పాలు పంచుకున్న

**జిల్లావార్తలు**

దేగపూడి శ్రీనివాసులురెడ్డి, హజరత్‌రెడ్డి, వారి మిత్రుడు మణి ఆ రోజు రాత్రి 10 గంటలకి కృష్ణవేణమ్మ ఇంటి వెనుక గేటు నుంచి వచ్చినట్లు తెలిసింది.

## పాముకాటుకు వైద్యం అందక మృతి

వరికుంటపాడు మండలం నల్ల బోతుల వారిపల్లె కాలనీకి చెందిన బండారు వెంకటేశు (45) పాముకాటు కారణంగా మృతిచెందాడు. ఆర్థిక పరిస్థితి కారణంగా ఆసుపత్రికి వెళ్లి వైద్యం చేయించుకొనే స్థితిలేక నాటు వైద్యాన్ని నమ్ముకొని వెంకటేశు ప్రాణాలు కోల్పోయాడు. నల్లబోతులవారి పల్లెకు ఒక కిలోమీటర్ దూరంలో 20లక్షల రూపాయల వ్యయంతో గండిపాళెంలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రం నిర్మించి నప్పటికి అక్కడ వైద్యాధికారి, సిబ్బంది అందుబాటులో వుండడం లేదు. పాముకాటుకు అవసరమైన మందులు ఇక్కడ లేకపోవడం వల్ల విషపురుగుల బారినపడిన అనేక మంది నిరుపేదలు ఎటువంటి వైద్య సదుపాయం అందక ప్రాణాలు పోగొట్టుకొంటున్నారు. ఈ ప్రాంతంలోని, గండిపాళెం, సీతారాం పురం, వరికుంటపాడు గ్రామాల్లోని

తొరవ 7వ పేజీలో

# నెల్లూరు ముచ్చట్లు

## అత్యాచారం చేశారని పోలీసులపై ఫిర్యాదు

నెల్లూరు బాలాజీనగర్‌లో వ్యభిచార గృహం నడుపుతున్న సుశీల అనే మహిళ తనపై ఆరుమంది కానిస్టేబుళ్లు అత్యాచారం జరిపారని జిల్లా ఎస్పీ శ్రీనివాస రెడ్డికి ఫిర్యాదు చేసింది. విచ్చలవిడిగా వ్యభిచారం చేయిస్తున్న సుశీలను ఐదు రోజుల క్రిందట ఆరవ పట్టణ పోలీసులు అరెస్టు చేసి ఆమెపై పిటిఏ యాక్టు క్రింద కేసు నమోదు చేశారు. ఇది ఇలా వుండగా ఆరవ పట్టణ పోలీస్ స్టేషన్‌లో పనిచేస్తున్న కానిస్టేబుళ్లు శ్రీనివాసరెడ్డి, సుధాకర్, రఫీద్, మణి, విజయ్ తనపై అత్యాచారం చేసినట్లు ఫిర్యాదులో పేర్కొంది. ఈ కేసులోని నిజానిజాలు దర్యాప్తు చేయమని ఎస్పీ తన ఐడి పార్టీని ఆదేశించారు.

## భార్యపై మోజు తీరి తగులబెట్టాడు

భార్యపై మోజు తీరి ఆమెను కిరాతకంగా తగులబెట్టిన భర్త ఉదంతమిది. నెల్లూరు శ్రీనివాస అగ్రహారానికి చెందిన వెంకటేశ్వర్లు భార్య వుండగానే, మరో మహిళతో అక్రమ సంబంధం పెట్టుకొన్నారు. తమ సంబంధానికి భార్య పద్మ (22) అడ్డు తగులుతుండడంతో బుధవారం ఆమెపై కిరోసిన్ పోసి తగులబెట్టాడు. తీవ్రగాయాలై పెద్దాస్పత్రిలో చికిత్స పొందుతున్న పద్మ ఉద్దేశ్య పూర్వకంగా తన భర్త ఈ పని చేసినట్లు న్యాయమూర్తి ముందిచ్చిన మరణ వాంగ్మూలంలో చెప్పింది.

## అత్తింటివారు తిట్టారని అల్లుడు ఆత్మహత్య

నెల్లూరు కపాడిపాళెంకు చెందిన కె.ఫ్రాన్సిస్ (28) అనే యువకుడు అత్తింటివారు తిట్టారనే బాధతో వంటి మీద కిరోసిన్ పోసుకొని ఆత్మ హత్య చేసుకున్నాడు. ఫ్రాన్సిస్‌తో గొడవ పెట్టుకున్న అతని భార్య పుట్టింటికి వెళ్లి పోయింది. మంగళవారం తిరిగి భార్యను పిల్చుకొనిరాను వెళ్లిన ఫ్రాన్సిస్‌ను అత్తింటి వారు నానామాట లన్నారట. సున్నిత మనస్కుడైన ఫ్రాన్సిస్ ఇంటికి తిరిగివచ్చి వంటిపై కిరోసిన్ పోసుకొని నిప్పంటించుకొన్నాడు. శరీరం తీవ్రంగా కాలిపోవడంతో నెల్లూరు పెద్దాస్పత్రిలో చికిత్స పొందుతూ గురువారం ఉదయం చనిపోయాడు. మూడవ పట్టణ పోలీసులు కేసు నమోదుచేసి దర్యాప్తు చేస్తున్నారు.



## సంగం వద్ద బ్యారేజ్ వద్దని రైతుల ప్రదర్శన

సంగం వద్ద పెన్నానదికి బ్యారేజ్ కట్టాలని కోవూరు ఎమ్మెల్యే ప్రసన్న కుమార్‌రెడ్డి పాదయాత్ర మొదలెట్టి ముఖ్యమంత్రి చేత చీవాట్లు తిని ఒంగోలులో దీన్ని విరమించుకొన్న సంగతి పాఠకులకు విదితమే. అసలు సంగం వద్ద బ్యారేజ్ వద్దని కోలగట్ల, వాసిలి, పెరమన, కొరిమెర్ల, సంగం గ్రామాలకు చెందిన 300 మంది రైతులు బుధవారం ప్రదర్శన చేసి, సంగం ఎమ్మార్వోకు వినతిపత్రం సమర్పించారు. బ్యారేజ్ ప్రయత్నం చేస్తే తమ గ్రామాలన్నీ మునిగిపోతాయన్నది గ్రామస్తుల వాదన. ఈ సందర్భంగా బ్యారేజ్ వ్యతిరేక అఖిలపక్ష కమిటీని ఏర్పాటు చేసుకొని దీనికి అధ్యక్షునిగా పి.గోపాలకృష్ణారెడ్డిని ఎన్నుకొన్నారు.

## ఆపరేషన్‌చేయించుకొన్నా బిడ్డకు తల్లయ్యింది

లక్ష్యాల సాధింపు మోజులో ప్రభుత్వ డాక్టర్లు నిర్లక్ష్యంగా చేసే ఆపరేషన్లలో కుటుంబ నియంత్రణ ఆపరేషన్లది మొదటి స్థానం. నెల్లూరు వెంగళరావునగర్ బి.బ్లాకు చెందిన ఎన్.తులసీకు ముగ్గురు ఆడపిల్లలు. ఈ యేడాది ఏప్రిల్ నెలలో జరిగిన జన్మభూమి కార్యక్రమంలో భాగంగా ఏర్పాటు చేసిన కు.ని. ఆపరేషన్ల ప్రత్యేక శిబిరమైన నెల్లూరు పెద్దాస్పత్రిలో కుటుంబ నియంత్రణ ఆపరేషన్ చేయించుకొంది. దీనికిగాను ప్రభుత్వం ప్రశంసాపూర్వక సర్టిఫికేటు, 500 రూపాయల ప్రోత్సాహక బహుమతి కూడా ఇచ్చింది. ఆపరేషన్ చేసిన రెండవ నెలలో ఆహారం తింటే వాంతులు చేసుకొంటుండగా, స్కానింగ్ తీయించడంతో నాలుగు నెలల గర్భవతి అనితేలింది. చేసేది లేక గర్భాన్ని ఉంచుకొన్న ఆమె సోమవారం పెద్దాస్పత్రిలోనే మగ బిడ్డను ప్రసవించింది. మహిళలకు ప్రాథమిక పరీక్షలు చేయకుండా కుటుంబ నియంత్రణ ఆపరేషన్లు చేసేపనికి ఇటు ప్రభుత్వం, అటు డాక్టర్లు మానితే మంచిది.

## ఖైదీలకు ఎమ్మెల్యే ఇఫ్తార్ విందు

జిల్లా జైలులో శిక్షననుభవిస్తూ రంజాన్ ఉపవాస దీక్షలో వున్న ఖైదీలకు నెల్లూరు ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి మంగళవారం సాయంత్రం ఇఫ్తార్ విందు ఇచ్చారు. మునిసిపల్ వైస్ ఛేర్మన్ సందానిబాషా, పలువురు కౌన్సిలర్లు, జైలర్ అనంతరావు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. జిల్లా జైలులో 20 మంది ఖైదీలు రంజాన్ ఉపవాసాలున్నారు.

## కన్నబిడ్డలను కడతేర్చిన కసాయి తండ్రి

జలదంకి గ్రామానికి చెందిన ఈర్ల వెంకటేశ్వర్లు తన కన్న బిడ్డలు భాగ్యశ్రీ (10), శ్రీదేవి (8) కిరాతకంగా హత్యచేసి తన బంధువుల సహాయంతో రహస్యంగా పూడ్చిపెట్టాడు. వెంకటేశ్వర్లు సంవత్సరం క్రిందట నిజామాబాద్ జిల్లా ఎల్లారెడ్డి గూడెంలో తన భార్యను హత్య జేశాడట. ఈ హత్యకు కన్న బిడ్డలు ప్రత్యక్ష సాక్ష్యులవడం వల్ల శిక్ష నుంచి తప్పించుకోవడానికి ఈ దుర్మార్గానికి పాల్పడ్డాడట. హత్యచేసిన వెంకటేశ్వర్లుకు సహకరించిన అతని తమ్ముడు అంకయ్యను కూడా పోలీసులు మంగళవారం అరెస్టు చేశారు.

ఎస్. సిద్దారెడ్డి కుమారుడు వెంకటేష్ రెడ్డి, వాకాడు వాస్తవ్యులు సుందరరామిరెడ్డి కుమార్తె శాలినిల వివాహం డిసెంబరు 7వ తేదిన గూడూరు సి.ఆర్. రెడ్డి కళ్యాణ వేదికపై జరిగింది.

## బ్యాంకుల సమ్మె

పార్లమెంటులో ప్రవేశపెట్టనున్న బ్యాంకుల ప్రైవేటీకరణ, ప్రభుత్వ వాటాల ఉపసంహరణ బిల్లును వ్యతిరేకిస్తూ బ్యాంకు యూనియన్ల ఐక్య ఫోరం దేశవ్యాప్త పిలుపులో భాగంగా, 21తేది జిల్లాలో బ్యాంకు ఉద్యోగులు చేపట్టిన ఒక్కరోజు సమ్మె విజయవంతమయ్యింది. తొమ్మిది బ్యాంకు ఉద్యోగుల యూనియన్లు ఈ సమ్మెలో పాల్గొన్నాయి.

## సిమ్స్ హెల్తీ బేబీషో

నెల్లూరులోని సిమ్స్ చిన్న పిల్లల వైద్య కేంద్రం 24తేది హెల్తీ బేబీ షో - 2000 పోటీలు నిర్వహిస్తుంది. ఈ పోటీల్లో ఒక సంవత్సరంలోపు పాపాయిలకు సిమ్స్ హెల్తీ బేబీ టైటిల్, ఒక సంవత్సరం నుంచి 3 సంవత్సరాల లోపు బాలికలకు సిమ్స్ లిటిల్ మిస్ టైటిల్, ఒక సంవత్సరం నుంచి మూడు సంవత్సరాలలోపు బాలురకు సిమ్స్ లిటిల్ మాస్టర్ టైటిల్, ఒక సంవత్సరం నుంచి 3 సంవత్సరాలలోపు బరువు తక్కువగా, నెలలు తక్కువగా పుట్టిన పిల్లలకు సిమ్స్ కిడ్ టైటిల్‌ను బహూకరిస్తారు. పోటీలు సాయంత్రం ఐదు గంటలకు పొగతోటలోని సిమ్స్ చిన్న పిల్లల వైద్య కేంద్రంలో జరుగుతాయి.

## స్మైల్ డెంటల్ హాస్పిటల్ వైద్య శిబిరం

రమేష్‌రెడ్డినగర్‌లో కొత్తగా ఏర్పాటు చేసిన స్మైల్ డెంటల్ హాస్పిటల్ నేతృత్వంలో 24తేది కోవూరులో ఉచితవైద్య శిబిరం ఏర్పాటయ్యింది. కోర్టు ఆవరణలో జరిగే ఈ వైద్య శిబిరంలో ప్రజలకు దంత పరీక్షలు చేసి మందులు వుచితంగా ఇస్తామని డాక్టర్ బి.కిరణ్ చెప్పారు.

## మాడరన్ ఐ క్లినిక్‌లో కంటికి కొత్త ఆపరేషన్

నెల్లూరు కె.వి. అగ్రహారంలోని మాడరన్ కంటి వైద్యశాలలోని డాక్టర్ వి.భారతి ఇటీవలే అమెరికా వెళ్లి కొత్త పద్ధతుల్లో కంటి ఆపరేషన్ చేయడాన్ని నేర్చుకొని వచ్చారు. కంటికి కుట్లు, కట్లు, ఇంజక్షన్ చేయకుండా ఆపరేషన్ చేసి గంటలో ఇంటికి పంపేస్తారు. 'ఫేకో ఎమల్సిఫికేషన్' అనే కొత్త ఆపరేషన్ వల్ల ఇది సాధ్యమవుతుంది. మాడరన్ కంటి వైద్యశాలలో వున్న అధునాతన పరికరాలతో ఈ ఆపరేషన్ చేస్తారు. ఈ ఆపరేషన్ చేసిన మరుసటిరోజు చూసే కంటితో గతంలోకన్నా శుభ్రంగా చూడొచ్చని, మూడోరోజు నుంచి అన్నీ పనులు చేసుకోవచ్చని డాక్టర్ భరోసా ఇస్తున్నారు. ఈ ఆపరేషన్‌కు మద్రాస్, హైదరాబాద్ వంటి నగరాల్లో 20వేలకు పైగా వసూలు చేస్తుంటే, తాను ఎనిమిది నుంచి 10వేల లోపు ఖర్చుతో చేస్తామంటున్నారు డాక్టర్ భారతి. కొత్త పద్ధతిలో ఆపరేషన్లు చేయించుకోవాలనే వారు మాడరన్ కంటివైద్యశాలకు వెళ్లవచ్చు.

## ఎయిడ్స్‌లో నెల్లూరు రికార్డు

ఎయిడ్స్ వ్యాధికి మూలకారణమైన హెచ్.ఐ.వి. వున్నవారి సంఖ్యలో దేశంలోనే నెల్లూరు జిల్లా ప్రథమ స్థానంలో వున్నట్లు జిల్లా వైద్య ఆరోగ్య శాఖాధికారులు ధృవీకరించారు. ఇటీవల నిర్వహించిన సర్వే ప్రకారం జాతీయ స్థాయిలో 2.5శాతం మంది హెచ్ఐవి

కొరవ 7వ పేజీలో

## జిల్లావార్తలు

5వ పేజీ కొరవ

అనువ్రతుల్లో 'యాంటీవీనమ్' మందును అందుబాటులో పెట్టాలని ప్రజలు కోరుతున్నారు.

### మళ్లీ మొదలైన ఎర్రచందనం స్మగ్లింగ్

వెంకటగిరి అటవీ ప్రాంతంలో ఎర్రచందనం స్మగ్లింగ్ మళ్లీ జోరందుకుంది. వెలిగొండ అటవీ ప్రాంతంలో గత కొన్ని రోజులుగా స్మగ్లర్ల కదలికలు మొదలయ్యాయి. వారం రోజుల్లోనే లక్షల రూపాయల విలువ చేసే ఎర్రచందనాన్ని నరికి స్మగ్లింగ్‌కు సిద్ధం చేసుకొని వున్నారు. ఈ నెలలో వెంకటగిరికోన అటవీ ప్రాంతంలో 17 దుంగలు, డక్కిలి ప్రాంతంలో 84 దుంగలను ముందుగా వచ్చిన సమాచారం మేరకు పోలీసులు పట్టుకున్నారు. వెలిగొండ ప్రాంతంలోని పాశెంకోట, దాచెరువు, ఆముదూరు, తీర్థంపాడులో ఎర్రచందనం దొంగ రవాణా యదేచ్ఛగా జరుగుతుంది.

### అధికార్లు బెదిరింపులు మానాలి

బుచ్చిరెడ్డిపాళెం మండలంలో జరుగుతున్న అక్షరసంక్రాంతి కార్యక్రమంలో పాల్గొంటున్న ఉపాధ్యాయులపై మండల విద్యాధికారి బెదిరింపు వైఖరి మానాలని ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ మండల నాయకులు ఒక ప్రకటనలో అధికారులను కోరారు. ఈ సందర్భంగా యుటిఎఫ్ నాయకులు మండల అధికారులకు ఒక వినతపత్రాన్ని సమర్పించారు. ప్రస్తుత అక్షర సంక్రాంతిని వాస్తవ పరిస్థితుల ఆధారంగా పరిశీలించాలని, పనులకాలం, చలికాలం కావడం వల్ల అభ్యాసకులకు తగిన సమయం కాదని ఫెడరేషన్ నాయకులు అభిప్రాయపడ్డారు. ఉత్సాహ వాతావరణాన్ని కల్పించకుండా పోవడంతో ఈ కార్యక్రమం అధికార్ల, ఉద్యోగుల, ఉపాధ్యాయుల కార్యక్రమంగా మారిందని చెప్పారు. దీనికి తోడు అతి తక్కువ కాలంలో అపార ఫలితాలను సాధించాలనే ధోరణిని అధికారులు విడనాడాలని సూచించారు. దీనికోసం ఉపాధ్యాయులపై తీవ్రమైన ఒత్తిడి చేయడం మంచిది కాదని వినతిపత్రంలో కోరారు. ఒక్క ఉపాధ్యాయులు మాత్రమే కేంద్రాల నిర్వాహకులై మిగిలిన వారంతా వీరి మీద పెత్తనం చెలాయించే వారుగా మారుతున్నారని, వాస్తవ పరిస్థితుల్ని ఏ మాత్రం పరిగణనలోకి తీసుకోకుండా బెదరింపులతో ఒత్తిళ్లతో, ఆజ్ఞలతో అక్షర కేంద్రాలను నడిపించాలని కోరడం భావ్యం కాదని చెప్పారు.



## సిటీ ఫైనాన్స్

2వ పేజీ కొరవ

డిపాజిటర్లు పోలీసుల సహాయంతో, కండ బలం ఉన్నవారు దౌర్జన్యంతోనో, బెదిరించో, అసలు మొత్తాలను తీసుకోగలిగారే తప్ప, స్వచ్ఛందంగా సిటీ ఫైనాన్స్ నుంచి డిపాజిట్ అసలు మొత్తాన్ని వాపసు తీసుకున్న వారు కాగడా పెట్టి వెదికినా కానరారు. ప్రజల డబ్బులకు జవాబుదారీగా ఉండాల్సిన సిటీఫైనాన్స్ భాగస్తులు అందుకు విరుద్ధంగా వ్యవహరించి, దొంగలు దొంగలు ఊళ్లు పంచుకున్నట్లు వచ్చిందంతా దోచేసి ఇప్పుడు నీతి వాక్యాలు వల్లించడం క్షమార్హం కాదు. చేసిన తప్పులకు ప్రజలకు క్షమాపణ చెప్పి, అసలయినా చెల్లించి పాప పరిహారం చేసుకోకుండా తప్పించుకొనే తప్పుడు మాటలు చెప్పడం మోసగాళ్ల నైజం కాక మరేమిటి?

### వై.వి. వివరణ

సిటీ ఫైనాన్స్ సంస్థకు తాను బాకీలేనని తెలుగుదేశం నాయకుడు వై.వి.రామిరెడ్డి వివరణ ఇచ్చారు. తన సాయిరాం ఫైనాన్స్ సంస్థకు గాదంశెట్టి గోపాల్ మూడు లక్షల రూపాయలు బాకీ ఉన్నాడని ప్రామిసరీ నోటు చూపించాడు. సిటీ ఫైనాన్స్‌లో గతంలో తాను తీసుకున్న 75వేల రూపాయలు చెల్లు చేసి, రశీదు ఇస్తానని గాదంశెట్టి గోపాల్ చెప్పాడని అన్నారు. ఇది పోను తనకు గాదంశెట్టి గోపాలే బాకీ పడ్డాడని, వివరించాప. సిటీ ఫైనాన్స్‌లో తన అప్పు ఖాతా తీరిపోయిందని చెప్పి ఆ సంస్థ పత్రికలో ప్రచురించడం బాధాకరంగా వుందన్నాడు. ఆర్థిక లావాదేవీల్లో తాను నిక్కచ్చిగా ఉంటానని స్పష్టం చేశారు. సిటీ ఫైనాన్స్ విషయంలో వై.టి. నాయుడిపై వచ్చిన తప్పుడు ప్రచారానికి తనకు ఎటువంటి సంబంధం లేదని, రాజకీయంగా తనను ఇబ్బంది పెట్టాలని తన పేరు ప్రచారం చేశారని అన్నారు.

## నెల్లూరుసంగతులు

4వ పేజీ కొరవ

అధికారులను నిలదీసే కార్యక్రమం రూపొందిస్తామన్నారు. మాజీ మంత్రి వసలపెంచలయ్య మాట్లాడుతూ గతంలో ఎన్నడూ లేనంతగా అధికారవర్గంలో అవినీతి పెరిగిపోయింది. దీనికి ప్రభుత్వమే కారణం. సోమశిలను కట్టి నెల్లూరు ప్రజలకు నీళ్లు ఇవ్వకుండా కండలేరు ద్వారా చిత్తూరు, మద్రాసులకు నీళ్లు తరలిస్తున్నాయి. తెలుగుగంగ బ్రాంచి ఛానళ్లను ఎప్పటికి పూర్తి చేస్తారో తెలియదని విమర్శించారు. సమావేశంలో ఏసిసి సభ్యురు చేవూరు దేవకుమార్‌రెడ్డి, కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి, సిహెచ్. ప్రవీణ్ కుమార్‌రెడ్డి, ఊటుకూరు ఆదిమూర్తి, బాలసుధాకర్, ఉడతా వెంకట్రావ్‌యాదవ్, ఏసునాయుడు తదితరులు పాల్గొన్నారు.

## పవర్

మొదటి పేజీ కొరవ

ఆ అహంకారం ఎల్లకాలం పనిచేయదు. ప్రజలతో, ప్రజల సమస్యలతో అవినాభావ సంబంధం పెంచుకొన్నవాడే ప్రజానేతగా చరిత్రలో నిలుస్తాడు; పవర్ బ్రోకర్ల అండలో పదవులు సంపాదించే వాడు చరిత్రహీనుడిగా చీదరింపుకు గురౌతాడు. చింతామోహన్‌లో ఈ జ్ఞానోదయం ఎప్పుడు కల్గుతుందో మరి!

## రైతాంగం

2వ పేజీ కొరవ

పురుగులు పట్టిపోతున్న బియ్యాన్ని ఈ నిరుపేదలకు పంచి, ప్రాణాలు కాపాడవచ్చు. ఆరు నెలలకు మించి బియ్యం, గోధుమలు నిల్వ చేయలేరు. ఇప్పుడు ఎఫ్‌సిఐ దగ్గరున్న నిల్వలో కనీసం - పాతికభాగం సముద్రంలో పారపోయవలసి వస్తుంది. ఒక ప్రక్క ప్రజలు అన్నం దొరకక ఆకలితో చావడం, మరొక ప్రక్క ఆహారధాన్యాలు పురుగులు, ఎలుకల బారిన పడడం - ఎంత గొప్ప ప్రభుత్వాలు మనవి? *

## నెల్లూరుముచ్చట్లు

6వ పేజీ కొరవ

సోకిన వారుంటే నెల్లూరు జిల్లాలో మూడుశాతం మంది వున్నారట. ప్రజలను ప్రత్యేకంగా జాగృతపర్చే కార్యక్రమం చేపట్టకపోతే ఏదో ఒక ఉపద్రవం ముంచుక రావడం ఖాయం.

# భావనారాయణునికి- వాస్తు బాధ!

ఆంధ్ర రాష్ట్రంలోని అతిప్రాచీన ఆలయాలలో ప్రముఖమైన బాపట్ల భావనారాయణస్వామి ఆలయం. ఈ ఆలయాన్ని పరిశీలిస్తే ఆలయంపై ఊరి భవిష్యత్తు వాస్తు రీత్యా ఆధారపడినట్లు కనిపిస్తుంది.

ఆలయం పట్టణాంతర్భాగమైనా, మధ్యస్థం కావటం ఇందుకు కారణం. ఆలయంలోని 'అవాస్తు' స్థితిగతుల్ని సవరించుకోవలసిన బాధ్యత పౌరులపై వుంది.

### మూలవర్లు!

ఆలయ ప్రధానదైవం 'భావనారాయణ' స్వామి, అమ్మవారు సుందర వల్లీ రాజలక్ష్మి తాయారు. తూర్పున నృసింహ, ఆండాళ్, పశ్చిమంలో హనుమాన్, కేశవ, ఊయల మండపాలు, ఉత్తరం రాజ్యలక్ష్మి, విఖానసాచార్య, ఈశాన్యం రంగనాయకస్వామి (శయన రాయర పెరుమాళ్) మందిరాలున్నాయి.

### ఆలయవర్ణన

ఆలయం విశాలంగా దక్షిణ దిశాభిముఖమై వుంది. దక్షిణ గోపురం



నాలుగు అంతరువులు కలిగి వుంది. 'అంతరువు' కిరుప్రక్కలా ద్వారపాలక శిల్పాలున్నాయి. శిఖరంలో 'శయన రాయర పెరుమాళ్' ప్రతిమ వుంది. ఆలయంలో ఆగమశాస్త్ర బద్ధంగా బలిపీఠం, ధ్వజస్తంభం, ముఖ, మహామండపాలు, అంతరాళం, గర్భగృహం వున్నాయి. ప్రదక్షిణలో 'చోళస్తంభా' లున్నాయి. గర్భగుడి శిఖరం 'వేసర' శైలిలో వుంది. అంతర ప్రదక్షిణ పథంలో తమిళశాసనాలు, బాహ్యప్రదక్షిణ పథంలో తెలుగు శాసనాలు వున్నాయి.

భావనారాయణ స్వామి ఆలయాలు ఈ ఆలయ 'వ్యాసస్థితి'లో అయిదు వున్నాయి. అవి పంచభావ నారాయణ క్షేత్రాలుగా ప్రసిద్ధి చెందాయి. అవి బాపట్ల, పొన్నూరు, భావదేవరపల్లి, సర్పవరం, పట్టిసం.

ఈ ఆలయ ఘటనలలో మరొక అపూర్వ ఘట్టం నిత్యపూజావ్రతకల్పుడు, ఆలయ మిరాశీదారు నల్లూరి వేంకట రాయ దీక్షితులు 94మార్చిలో అష్టాక్షరి మహాయజ్ఞాన్ని నిర్వహించడం. అప్పటి నుంచి ఆలయ పూజాదికాలు పుంజు కున్నాయని అక్కడి వారి అభిమతం.

### ఆలయ చరిత్ర

ఆలయ శాసనాల్ని బట్టి పరిశీలిస్తే క్రీ.శ. 594 ప్రాంతాలలో క్రిమికంఠీరవ చోళుడిచే ఆలయం ప్రారంభించ బడిందనీ, ఆ తర్వాత క్రీ.శ.854లో చోళభూపాల దేవుడు ఆలయ అభివృద్ధికి అనేక దానాలు చేశాడనీ అర్థమవుతుంది. ఇతని కాలంలో కుందినం రాఘవరెడ్డి అనే శ్రీమంతుడు ఉత్తరంలో పంట చెరువు, కాలువలు త్రవ్వించి స్వామికి సమర్పించారు.

భల్లయచోళదేవ మహారాయల కాలంలో (క్రీ.శ. 1110) పశ్చిమంలోని వెలిచర్ల గ్రామాన్ని దానంచేసి 108 ఎకరాల శోత్రియాన్ని ఏర్పాటు చేశారు.

ఆ తర్వాత క్రీ.శ. 1037 - 1116 ప్రాంతంలో చోళసామ్రాజ్యాన్ని కులోత్తుంగ చోళుడు పాలిస్తున్న కాలంలో ఈ ఆలయ అభివృద్ధికి అనేక ప్రయత్నాలు జరిగాయి. కాకతీయ పరిపాలనలో గణపతి కాలంలో క్రీ.శ. 1136 లో ఆరు సంతతుల వారికి మిరాశీలు ఏర్పాటు చేయబడ్డాయి.

కాకతి రుద్రదేవ మహారాజు క్రీ.శ.1240 - 1319 కాలంలో, రెడ్డి రాజుల పాలనా సమయంలోనూ (క్రీ.శ. 1419) ఈ ఆలయం దిన దిన ప్రవర్ధమానమై అభివృద్ధికి నోచుకుంది.

క్రీ.శ. 1579లో బాపట్ల నిజాం సర్కారులో విలీనమయింది. క్రీ.శ. 1758 ఫ్రెంచివారు ఆలయాన్ని దోపిడీ చేసి శిథిలం చేశారు. క్రీ.శ. 1860 - 1759 కుంఫిణీ కాలంలో దివాను బహద్దూర్ కొండ్రేగుల జోగి జగన్నాథరావు ఆలయ బహుదా పునరుద్ధరించారు.

క్రీ.శ. 1803లో అమరావతి జమీందారు రాజా వాసిరెడ్డి వెంకటాద్రి ఈ సర్కారును వేలంలో కొన్నారు. క్రీ.శ 1865లో తహసీల్దారు వింజమూరు వెంకటరావు ప్రాకారాన్నీ, వాహనశాలను పునరుద్ధరించారు.

### ఆలయవాస్తు స్థితి!

పట్టణ 'మాధ్యమిక స్థితి' వల్ల ఆలయ ప్రభావం ఊరిపై తప్పక పడుతుంది. ఆలయం దక్షిణాభిముఖమై 'యమ' స్థానాన్ని చూస్తూవుంది. అందువల్ల ధర్మబద్ధమైన వాస్తు స్థితి చాలా అవసరం. అందులోనూ నైరుతి వీధిపోటు స్వామి తేజస్సునూ, ఆకర్షణ శక్తిని నిర్వీర్యం చేస్తున్నది.

అందువల్ల ఆలయ ఆగ్నేయ ప్రాంతంలో మరొక ప్రవేశ ద్వారాన్ని తెరువవలసి వుంది. ఫలితంగా ఆగ్నేయంలోని 'కట్టడాన్ని' ప్రవేశావసరాన్ని బట్టి తొలగించవలసి వుంది. ఈశాన్యం బావి ఆలయాన్ని పరిరక్షిస్తుండగా పశ్చిమంలోని మరొక బావి 'సమతుల్యత'ను దెబ్బ తీస్తున్నది. అందువల్ల పశ్చిమం బావిని పూడ్చివేసి అవసరమైతే తూర్పు ఉత్తరాల్లో మరొక బావిని త్రవ్వించాలి.

బాహ్య ప్రదక్షిణాపథంలోని ప్రాకారం ఆలయానికి రక్షణ కవచంలా వున్నప్పటికీ తూర్పు, ఉత్తరాల 'ఎత్తుమట్టి' సమతూకాన్ని దెబ్బతీస్తున్నది. అందువల్ల తూర్పు, ఉత్తరాలు పల్లం కావాలి.

ఆలయం చుట్టూ వున్న ప్రదక్షిణా పథాన్ని పశ్చిమ, దక్షిణాల్లో ఒకటి రెండడుగుల ఎత్తు చేసుకోవాలి. నైరుతి కల్యాణ మండపం, ఈశాన్యం బావి ఇంత కాలం ఆలయాన్ని పరిరక్షించాయి.

ఇకపోతే ఆలయం చుట్టూ తూర్పు, ఉత్తర ద్వారాల్ని తెరువవలసి వుంది. ఇంద్ర, కుబేర స్థానాలు ఆకర్షణకూ, ఆదాయానికీ మార్గాలు అవి రెండూ మ కేపడటం మంచిది కాదు. మొత్తం ఆలయంలో వాయువ్యం 'ఖాళీ' ఆలయ వాస్తు స్థితిని వెక్కిరిస్తున్నది.

పునరుద్ధరణలు జరిగిన తర్వాత నైరుతికి తగ్గించి ఆగ్నేయాన్ని, ఆగ్నేయానికి తగ్గించి వాయువ్యాన్ని నిర్మాణాలతో బరువు చేసుకోవడం మంచిది.

నైరుతి వీధిపోటును పరిహరించడానికి ప్రవేశ ద్వారాన్ని మార్చడం అత్యవసరం. ఆగమ, వాస్తు పండితులతో చర్చించి ఈ పద్ధతుల్ని అమలు పరచడం ద్వారా ఆలయంతో పాటు, పట్టణం కూడా ప్రవర్ధమానమవుతుంది. చరిత్ర గ్రంథంలో సువర్ణాధ్యాయాన్ని సృష్టిస్తుంది.

### యేసు జననం

*టి.పి.జాస్‌లైన్*

వినీల ఆకాశవీధుల్లో
దేవుని పద చిహ్నంగా
సజీవ శబ్దాలతో, సరికొత్త కాంతులతో
సంకెళ్లులేని ఈ జగతి కొరకు
ధృవతారగ యేసు వెలుగు చూపాడు
మనిషి రక్తంలో ద్వేషం
మస్తిష్కం మడతలో దోషం వుండబట్టే
మనిషి, మనిషిగా జీవించలేక
పాపాలతో ప్రయోగాలు చేస్తున్నారు
ఊపిరాడని ఈ లోకాన్ని చూసి
పాపాన్ని ప్రక్షాళనం చేయాలని
పరలోక పురవాసి ప్రభుయేసు
పాపుల సహవాసిగా
కన్యమేరి గర్భాన
బెత్లెహేము పురములోన
కోటిదీపాల కాంతులతో ప్రవహిస్తున్న
శిశువుగా జన్మించాడు
అమరం యేసు జననం
అజరామరం యేసు రక్షణ సువాక్యం

**రత్నమ్మ**
5వ పేజీ తరువాయి

ప్రాంతంలోని సున్నంబుగోళం, ఎతాపూరు, వేమసముద్రం, ఇరకందివిలోని గిరిజనులు ఈ చర్యకు ఒడిగడుతున్నారు. సున్నంబుగోళంలోని ఆంధ్రా - తమిళనాడు సరిహద్దులకు కొన్ని మీటర్ల దూరంలో దాదాపు 10 సున్నపు గుల్ల కంపెనీలున్నాయి. ఈ కంపెనీల వాళ్లు కూలీలను ప్రోత్సహించి రోజు కూలీ ఇచ్చి లక్షలు గడిస్తున్నారు. అక్రమ గుల్లతీతను అడ్డుకునేందుకు పులికాట్ వన్యప్రాణి సంరక్షణాధికారులకు లక్షల రూపాయలు ఖర్చుచేసి రెండు మోటారు బోట్లను ప్రభుత్వం ఇచ్చింది. వీటిపై వెళ్లి అక్రమంగా గుల్ల తీసేవారిని, పక్షులను వేటాడేవారిని పట్టుకోవాల్సిన సిబ్బంది, మొక్కుబడిగా విధులు నిర్వహిస్తున్నారు. దీంతో, రోజుకి దాదాపు 10 నుంచి 20 పడవల దాకా గుల్ల తమిళనాడుకు తరలిపోతుంది.

### ఆత్మకూరులో మందుబాబుల అల్లరి!

ఆత్మకూరులో మందుబాబుల అల్లరి శృతిమించి పోతుంది. రాత్రిపూట గ్రామంలో పోలీసు గస్తీ లేకపోవడంతో మందుబాబులు పలురకాల దౌర్జన్యాలకు దిగుతున్నారు. 18తేది రాత్రి పాత సినిమాహాలు సెంటర్‌లో కూల్‌డ్రింక్ షాపు ముందున్న తాటాకుల పందిరికి మందుబాబు నిప్పుపెట్టారు. దీంతో పందిరి కిందనున్న కూలింగ్ బాక్స్ కూడా కాలి బూడిదయ్యింది. బజారులో పనుల మీద వచ్చే మహిళలను, సినిమాలకు వెళ్లే దంపతులను కూడా మందుబాబులు ఇబ్బందులు పెడుతున్నారు. పోలీసు కాస్త చురుకుగా పనిచేస్తే మందుబాబుల అల్లరి తగ్గుతుంది.

### ఆత్మకూరుకు ఆరుగంటల విద్యుత్‌కోత

ఆత్మకూరు పట్టణంలో 21తేదీ నుంచి నిరవధికంగా ఆరు గంటల విద్యుత్ కోతను అమలు పరుస్తున్నారు. దీంతో మధ్యాహ్నం 12 గంటల నుంచి సాయంత్రం 6 గంటల వరకు కరెంట్ వుండడం లేదు. ఆత్మకూరులో విద్యుత్ నియంత్రణ వ్యవహారం రీకో చేతిలో వుంటుంది. కాని ట్రాన్స్‌కో ఎస్.ఇ. కుమారస్వామిరెడ్డి ఆదేశాల మేరకే విద్యుత్ కోత విధిస్తున్నట్లు రీకో అధికారులు చెప్పారు.

### కాలువనుదురాక్రమిస్తున్నారు

ఆత్మకూరు వెంకటేశ్వర థియేటర్ ప్రక్కగా వెళ్లే పంట కాలువను పూడ్చి దానిపై కొందరు దురాక్రమణదారులు కొట్లు కట్టేస్తున్నారు. దురాక్రమణదారుల ఈ స్థలాన్ని రెండు అంకణాలు నేల బాడుగకు, నెలకు 400 రూపాయలు వసూలు చేస్తూ అడ్వాన్స్‌గా 10వేల రూపాయలు తీసుకొంటున్నారు. ఇప్పటికే పంటకాల్వ పూడిపోయి సాగునీటికి రైతులు పడరానిపాట్లు పడుతున్నారు. దురాక్రమణదారుల వల్ల పొలాలకు నీళ్లు రాని పరిస్థితి ఏర్పడింది. ఇరిగేషన్ అధికారుల అసమర్థత వల్లే ఆత్మకూరులో పలుచోట్ల పంట కాల్వలు దురాక్రమణల పాలవుతున్నాయి. గ్రామంలో పంచాయతీ స్థలాల దురాక్రమణకు పంచాయతీ కార్యవర్గం బాధ్యత వహిస్తుందే తప్ప, ఇటుకు ఎటువంటి సంబంధంలేదని జిల్లా పంచాయతీ అధికారి సుబ్రహ్మణ్యం దురాక్రమణలపై వివరణ ఇచ్చారు.

### బకాయిలు చెల్లించని గ్రామాలకు విద్యుత్‌కట్

ఆత్మకూరు గ్రామీణ విద్యుత్ సహకార సంఘం (రీకో) పరిధిలో వుండే పంచాయతీలు తాము రీకోకు చెల్లించాల్సిన బకాయిలు చెల్లించకుంటే విద్యుత్ సరఫరాను ఆపివేస్తామని రీకో ఛైర్మన్ పందిళ్లపల్లి సుబ్బారెడ్డి చెప్పారు. అనుమసముద్రంపేట, అనంతసాగరం, ఆత్మకూరుల్లోని పంచాయతీలు 55లక్షల మేర బకాయిలు చెల్లించాలని, పంచాయతీలు కనీసం 50శాతంపైన బకాయిలు కట్టకపోతే విద్యుత్ సరఫరా చేయలేమన్నారు.

**డిసిసి వద్దు**
5వ పేజీ తరువాయి

డిసెంబరు మాసంలో సైతం మంచినీటికి ఇబ్బందిపడాల్సి వస్తుంటె ఇక్కడి పరిస్థితులను అధికారులు అర్థం చేసుకోవాలంటున్నారు. ప్రజాప్రతినిధులు రైతులను ఆదుకొనే చర్యలు చేపట్టాలని కోరుతున్నారు.

**వార్డెన్**
5వ పేజీ తరువాయి

మంత్రి, నరసారావుపేట ఎమ్పీ నేదురుమల్లి జనార్ధనరెడ్డి ప్రతిపాదన మేరకు ఈ నియమకాలు జరిగాయి.



ఇళ్లమంత్రి ప్రభాకర్ రెడ్డి ఇచ్చిన ఇఫ్తార్ విందుకు ముందు నవాజు చదువుతున్న ఎల్లసిరి, బల్లి, ఆదాల, షణ్ము, ప్రసన్న రెడ్డి, విజయరామి రెడ్డి, తదితరులు.

# రోజా చెప్పిన సిటీ "ఆవు" కథ

పంద చిత్రాల్లో హీరోయిన్‌గా నటించినా గ్లామర్ హీరోయిన్ రోజా తన స్థితిగతుల పట్ల సంతృప్తికరంగా లేనట్లుంది. ఇటీవల పత్రికలవారితో మాట్లాడుతూ సినిమా నటి జీవితం పట్నవాసపు ఆవులాంటిది. ఈ ఆవుల్ని చూడి కట్టించేందుకు ఆంబోతులతో పనిలేదు.

## ఎందుకీ వేదాంత ధోరణి?

పశువైద్యశాలలకు తీసుకెళ్లి, ఇంజక్షన్‌లు చేయించి, కృత్రిమ వీర్యధారణతో చూడికట్టిస్తారు. నగరాల్లో ఆవులు సంసార జీవితానికి నోచుకోవు. సినిమా నటి జీవితం కూడా అంతే నగరాల్లో ఆవులాంటిదని రోజా చెబుతోంది. కుటుంబం అనే సెంటిమెంటును మోస్తూ ఇంట్లో వాళ్లందరి కోసం జీవితాంతం కష్టపడుతుండాలి. ఎన్నో త్యాగాలను కూడా చేయాలి. చివరికి ఆ నటికి మిగిలేదేమీ వుండదని వాపోయింది. పాపం రోజాకు ఎన్ని కష్టాలు వచ్చిపడ్డాయో?

## మాళవిక, కౌసల్య మధ్య కోల్డ్‌వార్

కన్నడిగులైన హీరోయిన్లు మాళవిక, కౌసల్య ప్రక్కప్రక్కనే ఇళ్లలో వుండేవారట. పూర్వాశ్రమంలో మంచి మిత్రులట; ఇద్దరి మధ్య దూరపు బంధుత్వం కూడా వుందట. కాని సినిమా పరిశ్రమకు వచ్చాక ఒకరి పొడ మరొకరికి గిట్టడం లేదు. ఒకరినొకరు తిట్టుకుంటున్నారు. కౌసల్యేమో నేను ఫీల్డ్ కొస్తే అది రావాలా అంటుంటే, ఫీల్డ్ ఒకరబ్బ సొమ్మా అని అంటుంది మాళవిక. ఇద్దరి మధ్య తగువు ఎప్పుడు సర్దుకొంటుందో?

# వీళ్లేం హీరోయిన్లండీ బాబూ!

సువలక్ష్మికి తెలుగులో పెద్ద అవకాశాలు రాకపోయినా కొన్ని తమిళ చిత్రాల్లో నటిస్తున్నది. ఈ మధ్య సువలక్ష్మి సిమ్రాన్, రంభ, ముంతాజ్ లంటే మండి పడుతుంది. ఈ మంటకు కారణం తమాషాగా వుంది. ఊటీ, కొడైకెనాల్‌లలో జరిగే షూటింగుల్లో నేను పూర్తిగా చీరకట్టుకొని చేస్తుంటేనే చలికి

## సువలక్ష్మి పలవరింత

తట్టుకోలేక పోతున్నాను. మరి వీళ్లంతా రెండు పీస్‌ల గుడ్డ ముక్కల తోనూ, ఒకే పీస్ గుడ్డతోనూ ఎలా చేస్తున్నారబ్బా అని ప్రశ్నిస్తున్నది. డబ్బు కోసం మరీ ఇంతగా తెగించాలా అంటూ యూనిట్ల వద్ద తమ గూర్చి మీటింగు పెట్టడాన్ని మిగతా హీరోయిన్లు జీర్ణించుకోలేక పోతున్నారు. గ్లామర్ పాత్రలు రానివాళ్లు ఏమైనా వాగుతారని సుతిమెత్తని విమర్శ తగిలించి ఊరుకొన్నారు.

## జానకి తీరని కోరిక

నెల్లూరు కోడలు, ఇప్పటి వరకు 15 భాషల్లో 12వేల పాటలు పాడిన గాయని జానకి. పాడిన పాటలకుగాను నాలుగుసార్లు ఉత్తమ గాయనిగా జాతీయ అవార్డు అందుకొన్నారు. పదకొండు సార్లు కేరళ ప్రభుత్వం అవార్డు, ఆరేసిసార్లు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ నంది అవార్డులు, తమిళనాడు అవార్డులు అందుకొన్న అరుదైన గాయని. యిన్నివేల పాటలు పాడిన ఈ గాయనికి 'నీ లీల పాడెద', 'ఏ దివిలో విరిసిన పారిజాతమో', 'నీలిమేఘాలలో' ప్రతిఘటన చిత్రంలోని 'ఈ దుర్యోధన దుశ్శాసన' పాటలంటే ఇష్టమంది. తాను దరిదాపులు అందరు గాయకులు, గాయనీమణులతో కలసి పాటలుపాడినా, తనకు ఇష్టమైన గాయని లతామంగేష్కర్‌తో కలసి పాడే అవకాశం కలగలేదంది. గాయనిగా ఆ లోటు ఒక్కటే తనకు మిగిలినట్లు చెప్పారామె.

# పరోపకారమే నా ధ్యేయం!

నా కళ్లెదురుగా ఎవరైనా అదే పనిగా ఏదో ఆలోచిస్తూ సైలెంట్‌గా ఉన్నారనుకోండి. వెళ్లి వాళ్లని పలకరించి మాట్లాడించాలనిపిస్తుందని హీరోయిన్ రచన చెప్పింది. అర్జంటుగా వాళ్లని మాటల్లో పెట్టకపోతే నాకసలు తోచదు. నా స్కూల్ డేస్ నుంచే ఇదే అలవాటు

## రచన

నాకు - ఎందుకే తల్లీ ఇలా వేధిస్తావ్? అని మా క్లాస్‌మేట్స్ గగ్గోలు పెట్టేవారు. ఇప్పుడు కూడా సెట్‌లో ఎవరైనా మరీ దీర్ఘంగా ఆలోచనలో పడినట్టు కనిపించారనుకోండి. వాళ్లు ఎవరైనా సరే తేడా లేదు. ఆఖరికి లైట్ బాయ్ అయినాసరే వెళ్లి ఏమిటి ఆలోచిస్తున్నావు అని అడిగేస్తాను. ఒకవేళ వాళ్లు ఏదైనా సీరియస్ ప్రాబ్లమ్ గూర్చి ఆలోచిస్తున్నారనుకోండి. వెంటనే నాకు చేతనైన సాయం చేస్తానని చెబుతుంది రచన. మనం కూడా అడిగి చూస్తేపోలా?

## ప్రత్యేక పాటల్లో నగ్మా

పాపులర్ హీరోయిన్ల చేత ప్రత్యేక పాటల్లో నటింప జేయడం ఇటీవల సినిమా పరిశ్రమలో అవలంభిస్తున్న కొత్త ట్రెండనాలి. రోజా, రమ్యకృష్ణ, రాశి, సంఘవి, రంభ ఒక్కో పాటలో కనిపించిన తీరులోనే నగ్మా కూడా ఆ దారి పట్టింది. తాజాగా తమిళంలో రూపొందుతున్న 'దీన' అనే చిత్రంలో అజిత్ సరసన నగ్మా ఒకపాటలో కనిపించనుంది. నగ్మా చెల్లెలు జ్యోతిక టాప్ హీరోయిన్‌గా జేజేలందుకొంటుంటే అక్కగారు స్పెషల్ సాంగ్స్‌లో కనిపించడం ప్రమోషనా... డిమోషనా?



మా ఆయన సుందరయ్య చిత్రంలో శ్రీహరి, దీప్తి.

# వెబ్‌సైట్‌లో "రంభ" సూక్తిముక్తావళి

హీరోయిన్ రంభ చాలా కాలం క్రితం ఒక వెబ్‌సైట్‌ను ప్రారంభించింది. ఇటీవల వరకు ఈ సైట్‌లో ఆమె నటించిన సినిమాలకు చెందిన రకరకాల భంగిమలు, సంగీతం కూడా వుండేవి. కాని ఈ మధ్య రంభ తన బాణీ మార్చింది. తన సైట్ ద్వారా తన అభిమానులకు పలుమంచి మాటల్ని చెప్తోంది. 'మీ తల్లి మీకు దైవంతో సమానం. ఏ విషయంలోనూ ఎప్పుడూ మీరు ఆమెను బాధపెట్టకూడదు' అంటూ కొన్ని మంచి వాక్యాలు సైటల్ పెట్టింది. బోధించింది. ఈ విషయమై రంభ మాట్లాడుతూ నా అభిమానులు నా సైట్‌ను సందర్శించినప్పుడు కొన్ని మంచి విషయాల్ని తెలుసుకోవాలన్నదే తన సంకల్పమన్నారు.

## సూర్యోదయంఅంటేఇష్టం

తనకు సూర్యోదయం చూడడమంటే బాగా ఇష్టమని హీరో శ్రీకాంత్ చెప్పారు. సూర్యోదయాన్ని తదేకంగా చూస్తుంటే నా మనసు ఎంతో ఉల్లాసంగా అనిపిస్తుంది. కొత్త ఉత్సాహాన్ని నాలో నింపుతుంది. పాజిటివ్‌గా ఆలోచింపజేసే లక్షణం సూర్యోదయంలో కనిపిస్తుంది. సూర్యోదయంలో సక్సెస్ కనిపిస్తే, సూర్యాస్తమయంలో ఫెయిల్యూర్ కనిపిస్తుందని వివరించారు శ్రీకాంత్.




## మరో బిడ్డ తల్లైన శ్రీదేవి

ముంబాయిలోని బ్రీచ్ కాండీ హాస్పిటల్‌లో నటి శ్రీదేవి ప్రసవించారు. రెండవ కాన్పులోనూ ఆమెకు ఆడపిల్లే పుట్టింది. తనకు ఎవరు పుట్టినా ఒకటేనంటుంది శ్రీదేవి.

## అమితాబ్ ఆనందం

అప్పుల్లో వున్నవారికి అవి ఉక్కు సంకెళ్లకన్నా బాధాకరంగా వుంటాయని సూపర్‌స్టార్ అమితాబచ్చన్ సెలవిచ్చారు. ఈ మాటలనేదానికి కారణం అమితాబ్ తన ఎబిసి కార్పొరేషన్ లిమిటెడ్ తరఫున తమకు 35కోట్లు బాకీ వున్నారని దూరదర్శన్ లెక్క తేల్చింది. అయితే అప్పు తీర్చేస్తానని అమితాబ్ అనగానే దానికి ప్రతిస్పందిస్తూ దూరదర్శన్ ఆ అప్పుల్ని 20కోట్లకు తగ్గించేసింది. ఇరవై కోట్లైనా అయితే ఇట్టే తీర్చేయనా? అంటూ సంతోషాన్ని ప్రకటించి 10 కోట్ల రూపాయలను ఏక మొత్తంగానూ, మరో 10కోట్ల రూపాయలను సులభ వాయిదాల్లోనూ చాలా త్వరలోనే తీర్చేస్తానని దూరదర్శన్‌కు లేఖ రాశారాయన. దీనిఫలితంగా 'కౌన్‌బనేగా కరోడ్‌పతి? అంటే ఇంత కాలం అమితాబ్ అనుకొన్నాం మనం. కాదు దూరదర్శన్ అని ఇప్పుడు మనం అర్థం చేసుకోవాలి.

# సరదాల 'అంకుల్' బాగున్నాడు

హాస్యనటుడుగా మంచి పేరులో వున్న ఎవిఎస్ నిర్మాతగా మారి "అంకుల్" చిత్రాన్ని రూపొందించాడు. అంతే కాదు ఈ చిత్రం తాలూకు కథ, స్క్రీన్‌ప్లే, ఒక పాట వ్రాశాడు. కీలకమైన అంకుల్ పాత్రను, ఆ పాత్రలో అంతర్లీనంగా నండే జగదీష్‌చంద్రప్రసాద్ పాత్రను పోషించాడు. ఈ విధంగా ఎ.వి.యస్. తన బహుముఖ ప్రజ్ఞను ప్రదర్శించాడు. అన్నిటా మెప్పును పొందాడు.

కథ అంకుల్ పాత్రను అంటిపట్టుకొని తిరుగుతుంది. అంకుల్ పాత్ర పేరు వీరాస్వామి. అతను కాలేజీలో ప్యూన్‌గా పనిచేస్తుంటాడు. చాలా కులాసాగా వుంటాడు. ఎప్పుడూ నవ్వుతూ నవ్విస్తుంటాడు. తన మనసులో ఎంతో బాధ వున్నా ఎవ్వరితోనూ చెప్పుకోడు. కాలేజీలో చదివే రాజా (తరుణ్), కీర్తన (పల్లవి) రాజా స్నేహిత బృందం బబ్లూ అండ్ కోకు వీరాస్వామి అంటే ఎంతో ఇష్టం. వీరంతా వీరాస్వామిని "అంకుల్" అని పిలుస్తుంటారు. ఈ అంకుల్ విద్యార్థులకు చేదోడువాదోడుగా వుంటాడు. వారికి ప్రేమ పాఠాలు నేర్పుతుంటాడు. రాజాకు కీర్తన మీద ప్రేమ వుందని తెలిసి ప్రేమలో ముందుకు పోయేందుకు మార్గం ఏర్పరుస్తాడు. ఈ పాత్ర అంకురించిన తీరు పుంకంగా ఎదిగిన తీరు, దాని




మానసిక పరిణామాలు అద్భుతంగా వున్నాయి.

రాజ్ నిర్లక్ష్యంగా, సరదాగా జీవితం సాగించే యువకుడు. ఎవ్వరినీ లెక్క చెయ్యడు. ఒక అంకుల్ మాటకు మాత్రం విలువ ఇస్తాడు. తనను ద్వేషించిన కీర్తనను పొందాలన్న పట్టుదల కలవాడు. ఇక కీర్తన కలవారి అమ్మాయి. చదువు కోసం పల్లె నుంచి పట్టణానికొస్తుంది. మొదట రాజ్‌ను ద్వేషిస్తుంది. అంకుల్ ప్రయత్నంతో రాజ్‌ను అంగీకరిస్తుంది. ఆత్మీయులకు అచ్చమైన రూపం అంకుల్‌ను విద్యార్థులంతా ఆరాధిస్తారు. రాజ్‌ను కీర్తనతో కలపటంతో కాలేజీ విద్యార్థులంతా అంకుల్ మానవత్వాన్ని ఒక పాటతో అభినందిస్తారు. "అంకుల్ అంకుల్ లిటిల్‌స్టార్ హౌవుయ్ వండర్ వాట్ యు ఆర్. ఫ్రెండ్ గైడ్. ఫిలాసఫర్ నువ్వే మాకు గాడ్‌ఫాదర్, అమ్మవు అన్నవు అనుకోమా. నాన్నా తమ్ముడుననుకోమా. ఎవరెవరనే ఈ లోకంలో అమ్మా నాన్నవు నువ్వేనుమా" - సుద్దాల అశోక్ తేజ వ్రాసిన ఈ పాటలో అంకుల్ వ్యక్తిత్వం పూర్తిగా అర్థమవుతుంది. అంతటి అభిమానంతో విద్యార్థుల అక్కున చేరిన అంకుల్ ఊహించని ఒక మలుపులో అతని గతం తాలూకు చర్యల వల్ల విద్యార్థులకు దూరం అవుతాడు.

అంకుల్‌కు ఒక గతం వుంది. అంకుల్‌గా పిలువబడే వీరస్వామి

కొరవ 11వ పేజీలో

# వారఫలాలు

23-12-2000తేది నుండి 29-12-2000తేది వరకు వృషభంలో గురు, శనులు; మిథునంలో రాహువు; ధనుస్సులో రవి, బుధ, కేతువులు; మకరంలో శుక్రుడు; వృశ్చిక, ధనుర్మకరాలలో చంద్రుడు.



## మేషం

(అశ్విని, భరణి, కృత్తిక 1వ పాదం)

ఆర్థిక పరిస్థితి బాగుంటుంది. రావలసిన బాకీలు కొంత వరకు పొందడం, బంధువుల యోగక్షేమాలు తెలియడం, కుటుంబ ఆరోగ్య సమస్యలు ఇబ్బంది పెట్టడం జరుగుతుంది. అనుకున్న పనులు నిదానంగా జరుగుతాయి. తొందరపాటు నిర్ణయాల వల్ల కొంత కష్టాలు పడతారు. వ్యాపార రంగంలో మంచి ఆర్థికాభివృద్ధి అవకాశాలు, రాజకీయ రంగాలలో పలుకుబడి పెరుగుతుంది. ఉద్యోగులు కార్యదక్షతను ప్రదర్శిస్తారు.

## వృషభం

(కృత్తిక2,3,4పాదాలు, రోహిణి, మృగశిర 1,2 పాదాలు)

అనుకున్న పనులు వాయిదా పడవచ్చును. ముఖ్య వ్యవహారాలు ఆలోచించి చేయాలి. స్థిరాస్తులపై విభేదాలు రావచ్చును. ఆర్థిక లావాదేవీలలో ఇబ్బందులు కలుగవచ్చును. అవసరాలకు రుణాలు కూడా చేయవలసి వస్తుంది. బంధువియోగ వార్తలు తెలియవచ్చును. అధికారులతో జాగ్రత్తగా ఉండాలి. ఉద్యోగ శ్రమ ఎక్కువగా ఉండవచ్చును. విద్యాప్రగతి బాగుంటుంది. కుటుంబ సౌఖ్యం బాగుంటుంది.

## మిథునం

(మృగశిర3,4పాదాలు, ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పాదాలు)

బిడ్డల వల్ల ఖర్చులు పెరగవచ్చును. వస్తు నష్టం, ఇతరుల వల్ల మాటలు పడటం జరుగుతుంది. ఆరోగ్యం సరిగా ఉండక పోవచ్చును. వృత్తి, వ్యాపార రంగంలో ఆశించిన ఆదాయం ఉంటుంది.

## కర్కాటకం

(పునర్వసు 4 పాదం, పుష్య, ఆశ్రేష)

చేపట్టిన పనులు విజయవంతం కాగలవు. ఆర్థికపరిస్థితి సామాన్యంగా ఉంటుంది. కుటుంబ ఖర్చులు ఎక్కువగా ఉంటాయి. వ్యాపార, వ్యవసాయ రంగాలలో స్తబ్దత ఉంటుంది. విలువైన వస్తువులు కొనడం, ఆస్తి వ్యవహారాలు రాజీచేసుకొనడం, విద్యార్థులకు ప్రగతి బాగుంటుంది. ఉద్యోగులకు ప్రభుత్వపరంగా అనుకూలత, అదనపు బాధ్యతలు వహించడం జరుగుతుంది.

## సింహం

(మఖ; పుబ్బ; ఉత్తర 1వ పాదం)

కుటుంబ సమస్యలు, కుటుంబంలోని వ్యక్తులకు అనారోగ్యం ఉంటుంది. బంధుమిత్రుల వల్ల కొద్దిపాటి ఆదాయం రావచ్చును. ఆర్థిక లావాదేవీలు, అగ్రిమెంట్స్, రావలసిన బాకీలు కొంత లభించడం జరుగుతుంది. వ్యవసాయదారులు, వ్యాపారస్తులకు గడ్డు పరిస్థితులుంటాయి. విధి నిర్వహణలో వివాదాలకు దూరంగా ఉండండి. వారాంతంలో ఆకస్మిక ప్రయాణాలుంటాయి. అధికారుల సహకారం ఉద్యోగులకున్నా, పనిభారం ఎక్కువగా ఉంటుంది. విద్యాప్రగతి బాగుంటుంది. రాజకీయ రంగంలో వారికి కొంత ఎదురు దెబ్బలు తగిలే పరిస్థితులున్నాయి. శుభకార్యాల నిర్ణయం జరుగవచ్చును.



## కన్య

(ఉత్తర 2,3,4పాదాలు; హస్త;చిత్త1,2పాదాలు)

ఆర్థిక పరిస్థితి బాగుంటుంది. కుటుంబ భావంలో కొద్ది పేచీలు రావచ్చును. సర్దుకొని పోవాలి. వృత్తి, వ్యాపార రంగంలో అవకాశాలు బాగుంటాయి. సోదరులతో కొద్ది విభేదాలు రావచ్చును. విలువైన వస్తువులు కొనడం, స్థిరాస్తుల క్రయవిక్రయాలు జరుగుతాయి. అగ్రిమెంట్లు జరుగవచ్చును. ఉద్యోగులకు బాధ్యతలు పెరుగుతాయి. అధికారులతో సన్నిహితంగా ఉంటారు. ఉద్యోగులకు స్థానమార్పు, దైవ కార్యాలలో పాల్గొనడం జరుగుతుంది.

### పంచాంగం

తేది25 సోమవారం క్రిస్మస్ తేది 28 గురువారం రంజాన్ తేది26 మంగళవారం నుండి శూన్యమాస ప్రారంభం.

డిశంబరు తిథులు

మార్గశిర బహుళ

తేది23శని త్రయోదశి రా 7.25గం.వ

తేది24 ఆది చతుర్దశి రా8.21గం.వ

తేది25సోమ అమావాస్య రా9.45గం.వ

పుష్యమాస శుక్ల

తేది26 మంగళ పాడ్యమి రా11.32గం.వ

తేది 27 బుధ విదియ రా1.37గం.వ

తేది 28జేస్త తదియ రా3.50 గం.వ

తేది 29 శుక్ర చతుర్థి పూర్తిగ

స్వయంపాకుల శ్రీనివాసులు, ఎం.ఏ.

## తుల

(చిత్ర3,4పాదాలు, స్వాతి, విశాఖ 1,2,3 పాదాలు)

తొందర, కోపగుణం ఉండి పనులు చెడగొట్టుకొంటారు. చరస్థిరాస్తుల పేచీలు కలుగవచ్చును. ఆరోగ్యం సరిగా ఉండదు. వాహనాలు నడిపేవారు జాగ్రత్తపడాలి. వృత్తి, వ్యాపార, ఉద్యోగ రంగాల వారికి ఆదాయం బాగానే ఉంటుంది. రుణం కూడా చేస్తారు. ఉద్యోగార్థులకు అసంతృప్తి ఉంటుంది.

## వృశ్చికం

(విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

పనులు సాధించుకోగల సమర్థత ఉంటుంది. ఖర్చులో వెనకాడరు. ఆదాయం కూడా అదేవిధంగా పెరుగుతుంది. రావలసిన బాకీలు ప్రస్తుతానికి రావు. న్యాయపరమైన చర్యలు తీసుకొంటారు. వృత్తి, వ్యాపార వర్గాల విస్తరణకు మంచి అవకాశాలుంటాయి. రాజకీయంగా మనుగడ బాగుంటుంది. శుభకార్య ప్రయత్నాలు వెనుకబడగలవు. ఆరోగ్యం కొద్దిగా లోపిస్తుంది.

## ధనుస్సు

(మూల, పూర్వాషాఢ, ఉత్తారాషాఢ 1పాదం)

ఆర్థికస్థితి బాగుంటుంది. వ్యాపార రంగంలో ముందుకు వెళ్లడానికి అవకాశాలు రావచ్చును. ఉద్యోగస్తులకు కూడా పెద్దల సహకారం, గుర్తింపు ఉంటుంది. కుటుంబంలో కొద్దిపాటి విభేదాలుంటాయి కాని సర్దుకుంటాయి. స్థిరాస్థి వ్యవహారాలను వాయిదా వేసుకోనండి. సొంత పనులు, అనుకూలంగా నెరవేరగలవు. అప్పుడప్పుడు కొంత ఉద్రేకాలుండి ఇబ్బంది పెట్టగలవు. పరోక్షంగా నిందించేవారుంటారు. మీపై కొద్ది మందికి అసంతృప్తి ఉందని గమనిస్తారు. సాంకేతిక యోగ్యత గలవారికి ఉద్యోగలాభం, అవకాశాలుంటాయి.



## మకరం

(ఉత్తరాషాఢ 2,3,4 పాదాలు, శ్రవణ, ధనిష్ఠ 1,2 పాదాలు)

ఖర్చులు పెరిగిపోయి రాబడిని గూర్చిన ఆలోచనలు చేస్తారు. ఆశించిన ఆదాయం లభించదు. వ్యాపార రంగంలో ఆర్థిక ఇబ్బందులుంటాయి. వ్యవసాయదారులు దెబ్బ తింటారు, కష్టపడతారు. తండ్రివర్గ బంధువియోగ వార్తలు వినవలసి రావచ్చును. ఉద్యోగులు పనివత్తిడికి బాగా నలుగుతారు. అధికారులు శ్రమ పెడతారు.

## కుంభం

(ధనిష్ఠ 3,4 పాదాలు, శతభిష, పూర్వాభాద్ర 1,2,3 పాదాలు)

కుటుంబ సభ్యుల వల్ల, బిడ్డల వల్ల బాధపడతారు. వస్తు నష్టం, ఇతరులచే విమర్శింపబడటం ఉంటుంది. వ్యాపార రంగంలో స్తబ్దత ఉంటుంది. వ్యవసాయదారులు కష్టపడతారు. స్థిరాస్తుల వల్ల, బంధువుల మధ్య విభేదాలు రావచ్చును. కుటుంబ ముఖ్యులకు ఆరోగ్యం సరిగా ఉండదు.

## మీనం

(పూర్వాభాద్ర 4పాదం, ఉత్తరాభాద్ర, రేవతి)

పనులు చేయడంలో పొరపాట్లు దొర్లి ఇబ్బంది పడగలరు. జాగ్రత్తపడాలి. పనులు సక్రమంగా జరుగవు. వాహన రిపేర్లు, వస్తు నష్టం. ఆరోగ్య లోపం, అపనిందలు పడటం ఉంటుంది. కుటుంబ సభ్యుల ఆరోగ్యం కూడా సరిగా ఉండదు. వృత్తి, వ్యాపార, రంగాలలో ఆదాయం మమూరుగా ఉంటుంది.

---

# జనవాణి

3వ పేజీ తొరవ

స్తున్నది. కాని ప్రయోజనం కనపడడం లేదు. తెలుగు ఎమ్పీలు పార్లమెంటులోనూ, బయటా ధర్నాలు చేశారు. రాష్ట్రంలోని రైతుల నుంచి భారత్ ఆహార సంస్థ 10లక్షల టన్నుల ధాన్యాన్ని కొనమని, స్వర్ణ మసూరిని 'ఏ' గ్రేడ్ ధాన్యంగా గుర్తించమని కేంద్ర ప్రభుత్వం ప్రకటించింది. కాని ఎఫ్‌సిఐ ఈ నిర్ణయాన్ని ఖాతరు చేయడం లేదు. ఎఫ్‌సిఐ ఇప్పటి వరకు 20వేల టన్నుల ధాన్యాన్ని కూడ కొనుగోలు చేయలేదు. గోనె సంచులు లేవని, సిబ్బంది లేరని, నాణ్యతా ప్రమాణాలకు తగినట్టు ధాన్యం లేదని రైతులను అదేపనిగా సాధిస్తూ నిరుత్సాహానికి గురిచేస్తోంది. విపత్కర సమయంలో కేంద్ర ప్రభుత్వం, ఎఫ్‌సిఐ అలా చేయడం తగదు.

బుచ్చిరెడ్డిపాళెం కె.రమణయ్య

## ముషరాఫ్‌తో మాటలేమిటి?

పాకిస్తాన్‌లో అక్రమ మార్గంలో అధికారం చేజిక్కించుకొన్న సైనిక నియంత జనరల్ ముషరాఫ్‌తో భారత్ చర్చలు జరపడం ఎంత మాత్రం తగదు. అసలు సైనిక నియంతను పాలకునిగా గుర్తించనేకూడదు. పాకిస్తాన్ సరిహద్దులలో కాల్పుల విరమణ పాటించినా, పాటించక పోయినా పాకిస్తాన్‌తో చర్చలు జరపాలంటే ముందుగా అక్కడ ప్రజాప్రభుత్వం ఏర్పాటు కావాలి. అప్పటి వరకు అక్కడ ప్రభుత్వమే లేనట్లు భావించాలి. ప్రజాస్వామ్యాన్ని చెరపట్టిన వ్యక్తితో భారత ప్రజాస్వామ్య పాలకులు ఎదురుగా కూర్చొని చర్చలు జరపడమేమిటి? అసలు పాకిస్తాన్ నుంచి, అక్కడి సైనిక పాలకుడి నుంచి వచ్చే ఏ ప్రతిపాదనకు మనం స్పందించి ప్రకటనలు ఇవ్వాల్సిన అవసరం లేదు.

నెల్లూరు వి.కళ్యాణి

## బిజెపికి టిడిపి మద్దతు ఉపసంహరించాలి

నిన్న మొన్నటి వరకు అయోధ్యలో రామమందిర నిర్మాణం సుప్రీంకోర్టు తీర్పుకు లోబడి ఉంటుందని చెబుతూ వచ్చిన ప్రధాని వాజ్‌పాయి, ఇప్పుడు ఆర్‌ఎస్‌ఎస్, విశ్వహిందూ పరిషత్‌కు లొంగిపోయారు. రామమందిర నిర్మాణం జాతి అభీష్టమని మాటమార్చి ప్రకటించారు. వాజ్‌పాయి ప్రకటన ముస్లింల మనోభీష్టాన్ని, ఆత్మగౌరవాన్ని పూర్తిగా దెబ్బతీసింది. లౌకికవాదానికి కట్టుబడి వున్నానని చెప్పే తెలుగుదేశం పార్టీ ఈ వ్యవహారాన్ని చూస్తూ ఊరుకోకూడదు. వాజ్‌పాయి ప్రభుత్వానికి మద్దతు ఉపసంహరించుకొంటేగాని కేంద్ర ప్రభుత్వం దారికి వచ్చేట్లు లేదు.

నెల్లూరు ఎస్.ఎ.ఎం.వాలన్సేని

## ప్రజాసమస్యలు చర్చించండి

పార్లమెంటు సమావేశాల్లో ప్రజా సమస్యలు చర్చకు రావడం లేదు. ఎక్కువ సమయం రాజకీయ అంశాల చర్చకే పరిమితమవుతుంది. దీనివల్ల ప్రజల కష్టాలు చర్చకు రాకుండా పోతున్నాయి. దీనికి ఒక్క రాజకీయ పక్షాన్ని తప్పు పట్టి ప్రయోజనం లేదు. అన్ని రాజకీయ పక్షాలు దీనికి బాధ్యత వహించాలి. దేశం సవాలక్ష సమస్యలతో సతమతమై పోతుంటే పాలక, ప్రతిపక్షాలు అయోధ్య సమస్యను పట్టుకొని వ్రేలాడడం సమంజసం కాదు.

నెల్లూరు జి.సుధాకర్

## గ్యాస్ ఏజన్సీ ఫోన్ పనిచేయదా?

నెల్లూరులోని హెచ్‌పి గ్యాస్ డీలర్ రెడ్డి అండ్ రెడ్డి గ్యాస్ ఏజన్సీ ఆఫీసును లక్ష్మీపురంకు మార్చారు. ఏజన్సీలో గల 329033 నెంబరు ఫోన్‌కుఎప్పుడు ఫోన్ చేసినా కనెక్షన్ దొరకదు. గుమస్తాలు ఫోన్‌ను ప్రక్కన తీసిపారేసిటట్లున్నారు. ఏజన్సీ యజమాని ఫోన్‌ను తీసుకొనే వాళ్లు జాగ్రత్తగా తమ బాధ్యతలు నిర్వహించేలా చేస్తే బాగుంటుంది.

నెల్లూరు టి.వి.నారాయణ

## మహిళారిజర్వేషన్‌పెరగాలి

స్వాతంత్ర్యానంతరం మహిళా రిజర్వేషన్ బిల్లు పార్లమెంట్‌లో ప్రవేశపెట్టడం విప్లవాత్మకమైన చర్య. నేటికీ స్త్రీలు, ఎస్‌సి., ఎస్‌టిల కన్నా దారుణ అణచివేతకు గురౌతున్నారు. ఇటువంటి పరిస్థితుల్లో చట్టసభల్లో 50శాతానికి పైగా రిజర్వేషన్ కల్పించినా తప్పులేదు. పురుషులు రాజకీయాల్లో, ప్రభుత్వాల్లో కొనసాగడం వల్ల అవినీతి పెచ్చుపెరిగి పోయివుంది. రాజకీయ రంగంలో మహిళలు విరివిగా ప్రవేశించడం వల్ల రాజకీయ ప్రక్షాళన జరుగుతుంది.

నెల్లూరు జి.రామమ్మ

## 50 ఏళ్లక్రితం

3వ పేజీ తొరవ

నుంచి వచ్చారు. సంస్థానాల సమ్మేళనంలో సర్దారుకు అండగా వుండిన వి.పి.మీనన్, దేవదాస్ గాంధీ గారలు చేరారు. హైదరాబాద్ ప్రధాని వెల్లోడి, సంస్థాన కాంగ్రెస్ అధ్యక్షుడు బిందూ, మద్రాసు గవర్నరు, బరోడా, మధ్య భారత్ రాజ ప్రముఖులు, పండిట్ పంత్, శుక్లా అందరూ ప్రత్యేక విమానాల్లో వెంట వెంటనే వచ్చారు.

సర్దార్ మృతకళేబరాన్ని చూచి నప్పుడు ఢిల్లీలో ధాత్రుడైన నెహ్రూ భోరున విలపించారు. పూర్ణకాంతులతో గంభీరంగా వున్న ఆ మూర్తిని చూస్తుండిన జవహర్ కండ్లు, మూడు నిముషాలు కూడా, ఆయన కళేబరాన్ని చూడలేక పోయ్యాయి. సర్దారు పోయిన నష్టమంతా జవహరుదే.

### బాబా 'చిట్కా'

ఒరిస్సా రాష్ట్రంలోని తలాయి అనే గ్రామములో నేపాల్ బాబా అనే బాలుడు ఏదో మందులు ఇస్తున్నాడని, దానివల్ల సకల రోగాలు నివారణౌతున్నవనే పుకారు ఆ దేశమంతా ప్రాకి, దినానికి కొన్ని వేల మంది ఆ గ్రామం చేర మొదలు పెట్టారు. ఈ జన సమర్థం వల్ల గతవారంలో కలరా వ్యాపించి దాదాపు 500 మంది మరణించి వుంటారని లెక్కవేశారు. శవాలు రైల్వేస్టేషన్‌లో, ఎక్కడంటే అక్కడ దిక్కు లేకుండా పడివుండినవట. పోలీసు బాబా యిల్లు సోదా చేసి అతడు పంచి పెడుతున్న మందును కొంత స్వాధీనం చేసుకొని, అతని యిల్లు కాపలా కాస్తున్నారట. ఒరిస్సా ప్రధాని అచ్చటె వుండి, నిలబడిపోయిన జనాన్ని వారి వారి గ్రామాలకు పంపివేస్తున్నారు. ఇది వరలో ఒరిస్సా ప్రభుత్వం ఈ మందును పరీక్ష చేయించగా అది బట్టి మోసమని తేలింది. గొర్రె దాటుంటే ఇంతకంటె ఏముంది!

### గఫర్‌ఖాన్‌కు శిక్ష

సరిహద్దు గాంధీ అబ్దుల్ గఫార్‌ఖాన్ గత సెప్టెంబరులోనే విడుదల గావింపబడవలసి వుండగా, పాకిస్తాన్ కేంద్ర ప్రభుత్వం దాని కంగీకరించక, ఆయన శిక్షను కాల నిర్ణయం లేకుండా పెంచిందట.

## ప్రజాదర్బార్

4వ పేజీ తరువాయి

జె.సి. రావత్, మాజీ ఎమ్మెల్యేలు కొమ్మి లక్ష్మయ్యనాయుడు, ఎల్లసిరి శ్రీనివాసులు రెడ్డి, మాజీ జి.వ. ఛైర్మన్ దేగా నారసింహా రెడ్డి, ఏ.ఏ. ప్రసన్నరెడ్డి, మునిసిపల్ వైస్ ఛైర్మన్ నందానిబాషా, పలువురు మునిసిపల్ కౌన్సిలర్లు, ఈ విందు పర్యవేక్షకుడు నమ్మి హాజరయ్యారు.

### మార్కెట్‌లో ఇంత ముదనష్టమేమిటి?

నెల్లూరుటౌన్‌ను సుందరంగా తీర్చిదిద్దేందుకు ఒక బృహత్తర ప్రణాళికను రూపొందించామని, దీనికి ప్రజలందరూ సహకరించాలని ఇళ్లమంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి చెప్పారు. 16తేది క్లీన్ అండ్ గ్రీన్ వారాన్ని పురస్కరించుకొని మంత్రి కోటమిట్ట, పెద్దబజారు, ట్రైకస్‌రోడ్డు, చేపల మార్కెట్ ప్రాంతంలో చెత్తా చెదారాలను తొలగించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ మునిసిపాలిటీ పరిధిలో షాపింగ్ కాంప్లెక్స్‌లు నిర్మించేందుకు 2.50కోట్లు మంజూరయ్యాయి. జిల్లాలో ఇంత వరకు 2కోట్లా 80లక్షల మొక్కలు నాటేందుకు ప్రణాళిక రూపొందించి 75శాతం మొక్కలు నాటినట్లు చెప్పారు. ఈ సందర్భంగా చేపల, మాంసం మార్కెట్ సందర్శించిన మంత్రి అక్కడ అధ్వాన్నపరిస్థితులను చూసి ఆశ్చర్య పోయారు. ఇక్కడ వ్యాపారాలకు అనువుగా షాపింగ్ కాంప్లెక్స్ నిర్మింపజేస్తానన్నారు. ముందు ఇక్కడి అధ్వాన్నపు పరిస్థితులను చక్కదిద్దమని మునిసిపల్ కమీషనర్‌ను మంత్రి ఆదేశించారు. జిల్లా కలెక్టర్ ప్రవీణ్‌కుమార్, ఎమ్మెల్యే వివేకానందరెడ్డి, ఛైర్మన్ తాళ్లపాక అనూరాధ, మునిసిపల్ కమీషనర్ రామ్మోహనరావు, మునిసిపల్ వైస్ ఛైర్మన్ నందానిబాషా తదితరులు పాల్గొన్నారు.

### రైతుబజారులో కూరలమ్మిన ఎమ్మెల్యే

తాను సృష్టించుకున్న ప్రజాపథం కార్యక్రమంలో భాగంగా నెల్లూరు ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి ప్రతి దినం టౌన్‌లోని ఏ సందు, గొందిలోనో పర్యటిస్తుంటారు. తన పర్యటన సందర్భంగా సిత్రాలు చేయనిదే ఆయనకు పొద్దు పోదు. ఈ నిత్య తిరుగుడు కార్యక్రమంలో భాగంగా 16తేది స్టోన్‌హౌస్ పేటలోని రైతు బజారుకు వెళ్లిన వివేకానందరెడ్డి కాసేపు మార్కెట్ తక్కెడ పట్టి కూరలమ్మారు. ఎమ్మెల్యే తమ సమస్యల పరిష్కారానికి వచ్చారన్న భ్రమలో ఇక్కడి వ్యాపారస్తులు వచ్చి పూసగుచ్చినట్లు తాము పడుతున్న ఇబ్బందులన్నీ ఏకరవు పెట్టారు. రైతుబజారులో పర్మినెంట్ షెడ్లు లేవని, ప్రస్తుతం వున్న కప్పులు వర్షం వస్తే, కురుస్తాయని, మూడు అడుగుల మురికినీళ్లలో వ్యాపారం చేస్తున్నామని, బజారులో మరుగుదొడ్ల సౌకర్యం కల్పించమని కోరారు. ప్రక్కనే వున్న మునిసిపల్ అధికారులను ఈ విషయాలన్నీ నోట్ చేసుకోమని ఎమ్మెల్యే షరా మామూలుగా ఆదేశించారు. ఫత్తేఖాన్‌పేటలో కొత్తగా నిర్మిస్తున్న రైతు బజారును ఎమ్మెల్యే ఈ సందర్భంగా సందర్శించారు.

### పెన్షనర్ల దినోత్సవం

సీనియర్ సిటిజన్స్ మరియు పెన్షనర్ల దినోత్సవం 17తేది టౌన్‌హాల్‌లో సంఘం అధ్యక్షులు జితేంద్రనాథ్ అధ్యక్షతన ఘనంగా జరిగింది. యం.ఎ.ఖాదర్ సభకు స్వాగతం చెప్పారు. జితేంద్రనాథ్ బాబు పెన్షనర్లు ప్రభుత్వం నుంచి పొందుతున్న ఆదరణను, ఎదుర్కొంటున్న సమస్యలను వివరించారు. ముఖ్యఅతిథిగా విచ్చేసిన జాయింట్ కలెక్టర్ ఎస్.ఎస్. రావత్ మాట్లాడుతూ రిటైర్డ్ వుద్యోగుల సంఘం నెల్లూరుజిల్లాలో చురుగ్గా పనిచేసినట్లు ఇతర జిల్లాల్లో పనిచెయ్యటం లేదన్నారు. దీనికి జితేంద్రనాథ్ బాబే కారణమన్నారు. రిటైర్డ్ వుద్యోగుల సమస్యల పరిష్కారానికి తన సంపూర్ణ సహకారం అందిస్తానన్నారు. ట్రెజరీ అధికారి కె. సురేంద్ర బాబు కూడా ట్రెజరీలో ఏర్పడ్డ సమస్యలను పరిష్కరిస్తానన్నారు. సీనియర్ సిటిజన్స్ డి.ఎస్.రెడ్డి, ఏ.ఆదెయ్య, మార్గరెట్, జి.దీనమ్మ, మరో తొమ్మిది మంది రిటైర్డ్ వుద్యోగులను ఈ సందర్భంగా సన్మానించారు. రిటైర్డ్ వుద్యోగులకు ఈ సందర్భంగా ఫాన్సీ డ్రస్ పోటీలను నిర్వహించారు.

### టీచర్ల కౌన్సిలింగ్‌లో అవినీతి

జిల్లా జాయింట్ యాక్షన్ కమిటీ కార్యవర్గ సమావేశం ఛైర్మన్ ఎన్.నారాయణ అధ్యక్షతన 17తేది ఎన్జీఓ హోంలో జరిగింది. సమావేశంలో ఉపాధ్యాయుల సమస్యలను చర్చిస్తూ ఇటీవల జరిగిన కౌన్సిలింగ్, రేషనలైజేషన్, డిఎస్సీల్లో చోటు చేసుకున్న అక్రమాలపై వున్నతాధికారులు విచారణ జరపక పోవడాన్ని ఆక్షేపించారు. కౌన్సిలింగ్‌లో 80 ఖాళీలను దాచిపెట్టి కౌన్సిలింగ్ చేయడాన్ని తప్పు పట్టారు. ఈ వ్యవహారంపై జిల్లా కలెక్టర్ జోక్యం చేసుకొని విచారణ చేయించకపోతే, ఈ విషయాన్ని ప్రభుత్వం దృష్టికి తీసుకవెళ్లాలని తీర్మానించారు. సమావేశంలో జెఎసి ప్రధాన కార్యదర్శి వేలూరు శ్రీనివాసులు, వైస్ ఛైర్మన్ వైకుంఠరావు, కోశాధికారి పసుపులేటి వెంకటేశ్వర్లు తదితరులు పాల్గొన్నారు.

### బెల్ట్ షాపులు

4వ పేజీ తరువాయి

నెలకు 12కోట్ల రూపాయల విలువైన మద్యం టార్గెట్‌గా పెట్టి కొనిపిస్తున్నారు.

డిపో మేనేజర్ ఒక్కొక్క మద్యం పెట్టెకు 10 రూపాయల చొప్పున నెలకు 8లక్షల రూపాయలు మామూలు వసూలు చేసి ఆయన లాభపడుతున్నారు. బెల్ట్ షాపులు లేకుంటే జిల్లాలో 12కోట్ల రూపాయల మద్యం అమ్ముడు కాదనే చెప్పాలి. నెల్లూరుటౌన్‌లోని బ్రాందీ షాపులకు అనుబంధంగా వుండే మినీబార్లపై ఎన్ఫీ వచ్చిన మొదట్లో రెండు, మూడుసార్లు దాడులు జరిపారు. కానీ మినీబార్లు మళ్లీ మామూలయ్యాయి. దామరమడుగు గ్రామ మహిళల్లో మాదిరి చైతన్యం వచ్చి బలవంతంగా బెల్ట్ షాపులు మూయించిన మార్గాన్ని మహిళలు అవలంభిస్తే తప్ప ఈ షాపులు మూతపడవు. అప్పటివరకు ఎక్సైజ్ అధికార్ల ఆదాయాలకు కొదవుండదు.

### ఏది మేలు?

గ్రిద్దలూరు గోపాలరావు

మనిషి శరీరాన్ని
బ్లడ్ బ్యాంకుగా మార్చి
రాత్రనక పగలనక
ప్రతి నిత్యం
రక్తం పీల్చుతాగే
దోమల దండుకంటె
ఉగ్రవాదుల దాడిమేలు
పెరట్లో పెంచుకున్న
పూలమొక్కలు, ఆకుకూరలు
ధ్వంసం చేస్తూ
ఇళ్లలోదూరి
దొరికినవన్నీ దోచుకునే
కోతి మూకకంటె
దారిదోపిడీగాళ్లు మేలు
కుప్పలు తిప్పలుగా
పట్టణమంతా పేరుకున్న
మునిసిపల్ చెత్తా చెదారం
మురికి గబ్బుకంటె
రాజకీయ దుర్గంధం మేలు
దేశభక్తి అనేది లేకుండా
శిక్షలకు భయపడకుండా
అవినీతిని ఆరాధించే
అధికార గణంకంటె
అనునిత్యం స్వార్థాన్ని స్మరించే
ప్రజాప్రతినిధులకంటె
నెక్సలుల్స్ అమర్చే
మందుపాతరలు మేలు
అది మేలు, ఇది మేలు
ఏది మేలు?
తరన, భర్తనలు వాలు
నరరాక్షస లోకంలో
పొందలేము మేలు
అందబోవు సుఖాలు
బాధల భారంతో
బ్రతుకు ఈడ్చటం కంటె
ఉరేసుక చావటం మేలు

### సానికొంపల్లో

4వ పేజీ తరువాయి

ప్రభుత్వకారులోనే దర్జాగా తిరుగుతున్నారు. మందు నుంచి మగువ వరకు అన్ని సింగిల్ విండో సిస్టంలో అమర్చే హైక్లాస్ వ్యభిచార గృహమిది. వేదాయపాళెంలోని ఓ అపార్టుమెంట్‌లో బరితెగించిన ఓ మహిళ యథేచ్ఛగా వ్యభిచారం చేస్తుంది. ఫోన్‌లో ఈమెను సంప్రదిస్తే ఎక్కడ కావాలంటే అక్కడకు అమ్మాయిలను పంపించే మొబైల్ బ్రోతల్ హౌస్ ఈమె ప్రత్యేకత. ఎకె నగర్ పోస్టాఫీసు సమీపంలో వున్న వ్యభిచార గృహానికి పగలు, రాత్రి నిరంతర రద్దీ. భక్తవత్సల నగర్‌లోని వ్యభిచార గృహంలో నిత్యం పోలీసులే కస్టమర్లు కాబట్టి ఈ గృహం నిర్వాహకులకు పోలీసులంటే భయమే లేకుండా పోయింది. రామ్మూర్తి నగర్, హరనాథపురం ప్రాంతాల్లో ఇటీవలే తిష్టవేసిన జారిణులు కోచింగ్ సెంటర్లలో చదువుకొంటున్న పిల్లల భవిష్యత్తును నాశనం చేస్తున్నారు. ఇటీవల వరకు కాంగ్రెస్ పార్టీలో వున్న ఓ మహిళా నాయకురాలు తన కుమార్తెల చేత హైక్లాస్ వ్యభిచారం చెయించటం విశేషం. కొంత మంది మహిళా మండళ్ల ముసుగులో వ్యభిచారం చేయిస్తున్నారు. బ్యాంకు రుణాల కోసం బ్యాంకర్ల వద్ద మహిళలను తీసుకెళ్లి తారుస్తున్నారు. భార్య, భర్తలు గొడవపడి దూరంగా వున్న వ్యవహారాల్లో మహిళా మండళ్ల నాయకురాళ్లు వీరిని కలపాల్సింది పోయి తమ గుప్పెట్లో పెట్టుకొని చండాలపు పనులు చేయిస్తున్నారు. వ్యభిచార గృహాల నిర్వాహకులను పోలీసులు అరెస్ట్ చేస్తే రాజకీయ నాయకులు ఫోన్ల మీద ఫోన్లు చేసి విడిపిస్తున్నారు. ఇటీవల స్టోన్‌హౌస్ పేటకు చెందిన 9వ తరగతి చదివే బాలిక చేత వ్యభిచారం చేయించిన 8మంది గల ముఠాను పోలీసులు అరెస్టు చేసి కోర్టుకు హాజరుపెట్టగా, వీరిని రిమాండ్‌కు ఆదేశించడంతో జైలులో పెట్టారు. వీరి కస్టమర్లైన రాజకీయ నాయకులు, అధికారులు వీరి క్షేమ సమాచారాలు అడుగుతూ ఒకటేపనిగా జైలుకు ఫోన్లు చేస్తున్నారట. మరికొందరు వీరిని ప్రత్యక్షంగా కలసిపోతూ బెయిల్‌పై ఏవిధంగానైనా బయటకు తెస్తామని చేతిలో చెయ్యేసి బాసలు చేస్తున్నారట. ఎందువల్లో నెల్లూరు పోలీస్ హైక్లాస్ వ్యభిచారిణుల జోలికి పోను జంకుతుంది. దీనికి సవాలక్ష కారణాలుండవచ్చు. పోలీస్ కరకుగా వ్యవహరిస్తే నెల్లూరులో విశృంఖల వ్యభిచారానికి తెరపడవచ్చు. ఇప్పటికే దేశంలో ఎక్కడా లేనంత మంది ఎయిడ్స్ రోగులు వైద్య అధికారుల లెక్కల ప్రకారం నెల్లూరులో నమోదయ్యారు. పెచ్చుపెరిగిన వ్యభిచారం వల్ల వీరి సంఖ్య పెరిగినా ఆశ్చర్యపోనక్కరలేదు.



వర్తమాన సమాజ మహాభారతోపన్యాసాల కార్యక్రమంలో శల్య పర్వంపై మాట్లాడిన తిరుమూరు సుధాకర రెడ్డిని సన్మానిస్తున్న వేదం వెంకటరామన్, ప్రక్కన వెంకురెడ్డి, రామసుబ్బారెడ్డి, శ్రావణ్‌కుమార్ వున్నారు.

### చిత్రసమీక్ష

9వ పేజీ తరువాయి

ఒకప్పుడు జగదీష్ చంద్రప్రసాద్. ఆ ప్రసాద్ ఎన్నో విద్యాసంస్థలు నిర్మించి ఎందరికో విద్యాదానం చేశాడు. ప్రసాద్ భార్య గాయత్రి (ఝాన్సీ) ముక్కోపి, ఆవేశపరురాలు. ఘర్షణ పడి ఆత్మహత్య చేసుకుంటుంది. ప్రసాద్ హంతకుడుగా జైలు శిక్ష అనుభవించాడని పోలీస్ బయట పెడుతుంది. అంకుల్ ద్వేషించి దూరమైన విద్యార్థులు నిదానంగా నిజం తెలుసుకొని అంకుల్ సమస్యను సాహసంతో పరిష్కరిస్తారు.

జగదీశ్ ప్రసాద్ ఎవర్ని హత్య చేశాడు, వీరస్వామిగా ఎందుకు మారాడు అనే విషయాలు చిత్రంలో మంచి సస్పెన్సు సృష్టిస్తాయి. చిత్రం మొదటి భాగం కాలేజీ వాతావరణంతో అల్లరి చిల్లరి పనులు, ప్రేమ పాఠాలు, పాటలతో అంకుల్ ఆప్యాయతలతో సరదాగా సాగిపోతుంది. రెండవ భాగం, జగదీశ్ ప్రసాద్ కథతో బిగువుగా రూపం దాలుస్తుంది. స్క్రీన్‌ప్లే ప్రతి సన్నివేశాన్ని చక్కగా బిగించింది.

రాజశేఖర్ ఈ చిత్రానికి దర్శకత్వం వహించాడు. దర్శకుడుగా ఇది ఆయనకు తొలిప్రయత్నమైనా చిత్రమంతటా ఆయన ప్రతిభా విశేషాలు కనిపిస్తాయి. ప్రతి సన్నివేశంలో ఆయన నేర్పు కనుపరిచాడు. చిన్న పాత్రలో నటుడుగా కూడా తెర మీద దర్శనమిస్తాడు. ఎం.వి.రఘు కెమెరా అన్ని సన్నివేశాలను సమర్థవంతంగా చూపింది. ప్రకృతి దృశ్యాలను కన్నుల పండువ చేసింది. వందేమాతరం శ్రీనివాస్ సంగీతం పాటల సాహిత్యాన్ని పసందు చేసింది. "కుర్రాళ్లం కుర్రాళ్లం ఏ అలుపూ ఎరుగని పందెపు గుర్రాలం" - ఏ.వి.యస్. వ్రాసిన ఈ పాట వినతగింది. తోటపల్లి మధు మాటలు చిత్రం ఊపుకు బాటలు ఏర్పర్చాయి. జగదీష్ చంద్ర ప్రసాద్ భార్య గాయత్రి ఆత్మహత్యకు పూనుకున్న సన్నివేశంలో ఝాన్సీ, ఏవియస్ నటన గొప్పగా వుంది. తరుణ్ బాగా రాణించాడు. పల్లవికి ఇది తొలిచిత్రం. తొలి ప్రయత్నంలోనే తన సత్తాను తెలియపరిచింది. బ్రహ్మానందం కాలేజీ ప్రిన్సిపాలు దేశికాచారిగా విధికొక ఉంపుడు గత్తెను ఉంచుకుంటాడు. అతన్ని విద్యార్థులు "నారీ నారీ నడుమ దేశికాచారి" - అని గేలిచెయ్యటం మంచి హాస్యం కలిగిస్తుంది. కథకుడుగా, స్క్రీన్‌ప్లే రచయితగా, గీతా రచయితగా నిర్మాతగా ఏవియస్ తొలిప్రయత్నం ప్రస్తుతించతగింది. అలాగే రాజశేఖర్ దర్శకుడుగా తొలిప్రయత్నం ఫలింపు అభినందనీయం.

# ప్రేలాపనలు

మొదటి పేజీ కొరవ

ప్రయత్నం చేసింది.

ప్రభుత్వంపైన, ప్రభుత్వ అధినేతల పైనే కాకుండా, ప్రభుత్వానికి వత్తాసు పలికే పత్రికలపై కూడా గత ఐదారేళ్లుగా సాహసోపేత సమరం చేస్తున్న వ్యక్తి ఒక్కసారిగా రాజీపడిపోతారా? అర్థంలేని ఆరోపణ. కాని కాలం కలసిరానప్పుడు కర్ర కూడా పామై కరుస్తుందట. హైకోర్టులో కేసులు వాపసు తీసుకోవడం పెద్ద తప్పయిపోయింది విమర్శకుల దృష్టిలో! వీటినివాపసు తీసుకున్న కారణం అందరికీ తెలుసు. హైకోర్టులో ఒకదాని వెంట మరొకటిగా కేసులు కొట్టివేయబడడం; పైగా ఆ తీర్పులలో కొన్ని ఇబ్బందికర వ్యాఖ్యలు జతకలవడం - ఉపసంహరణకు ప్రధాన కారణం. ఇదే విషయాలపై సుప్రీంకోర్టులో మరొక సమగ్రమైన కేసు విచారణకు రానున్నది కాబట్టి; హైకోర్టు చేసే వ్యాఖ్యలు దానిపై ప్రభావం చూపే ప్రమాదం వుందన్న భయంతో, న్యాయవాదులు తీసుకున్న నిర్ణయం అది. కాని మాజీ పిసిసి అధ్యక్షుడు వి.హనుమంతరావు, మరికొందరు కాంగ్రెస్ వాదులు దానికి రాజకీయ రంగు పులిమారు. చంద్రబాబుతో రాజీపడిపోయారని ఆగం సృష్టించారు. హైకమాండ్‌కు ఫిర్యాదులు చేశారు; తెలుగు దినపత్రికలూ ఈ దుష్ప్రచారానికి యథోచిత ప్రాధాన్యత సంతరించి పెట్టాయి.

కేసుల ఉపసంహరణపై ఇంత న్యూసెన్స్ సృష్టిస్తున్న కాంగ్రెస్‌వాదులు - వాటి విచారణకు ఏ సమయంలోనైనా, రవ్వంత అయినా సహకారం అందించారా? లేదు కాక లేదు! గతంలో పిసిసి అధ్యక్షుడిగా, ఇప్పుడు సిఎల్‌పి నేతగా రాజశేఖరరెడ్డి చేసిన, చేస్తున్న రాజకీయ పోరాటాలలో ఎప్పుడూ, ఎవ్వరి చేయూత లేదు; అన్నీ ఒంటరి పోరాటాలే! కేసుల ఉపసంహరణ వల్ల పార్టీకి నష్టం జరిగిపోయిందని ఇల్లెక్కి కేకలు పెట్టేవారికి నిజంగా పార్టీ పట్ల చిత్తశుద్ధి వుంటే - చంద్రబాబుకు వ్యతిరేకంగా రాజశేఖరరెడ్డి జరిపిన యుద్ధంలో చేయి కలపక పోతే పోయారు కనీసం అందులో ఆవగింజంత అయినా తమకు తాముగా కృషి జరిపారా? లేదంటే లేదు! అప్పుడంతా అంతు చిక్కకుండా తిరిగిన వారు, ఇప్పుడు పార్టీ భారం సమస్తం తామే మోస్తున్నట్లు, ఎన్నవలు పెట్టి ఏడుస్తున్నారు. ఇదంతా చవకబారు డ్రామా. వారికి కావలసింది పార్టీ శ్రేయస్సు కాదు; వ్యక్తిగత కక్షలు తీరడం!

కేసుల ఉపసంహరణ కంటే, వీరి ఆగం వల్లనే కాంగ్రెస్ అధికంగా నష్టపోతున్నది. కాంగ్రెస్ వాదుల బుద్ధి ఎప్పటికీ మారదు అనే నిస్పృహ జనంలో ఏర్పడుతున్నది. ఈత రాక బావిలో మునిగిపోయేవాడి నెత్తిన బండ విసిరి వినోదం చూసేవారిని ప్రజలు ఈసడించుకొంటున్నారు; అసహ్యించుకొంటున్నారు.

రాజశేఖరరెడ్డిలో కూడా చాలా మార్పు రావలసి వుంది. ఎన్ని ఎదురు దెబ్బలు తగిలినా, అనుభవంలో ఎంతగా రాటుదేలినా ఆయనలో ఉద్రేకం, దుడుకుతనం తగ్గడం లేదు. కీలక రాజకీయ నిర్ణయాలు తీసుకునేటప్పుడు పదిమందితో చర్చించడం, పది నిముషాలు వెనుకా ముందు ఆలోచించడం జరగదు ఆయన విషయంలో! ఆ తొందరపాటు తనమే ఇటువంటి నిందలకు కారణమౌతున్నది.

# గరం, గరం

మొదటి పేజీ కొరవ

గందరగోళ స్థితి. రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలకు చిత్తశుద్ధి వుంటే ఇకముందైనా ఇటువంటి పొరపాట్లు జరగకుండా సరైన యంత్రాంగం ఏర్పర్చాలి. అంతర్జాతీయ మార్కెట్లలో వ్యవసాయ ఉత్పత్తుల ధరలు, వివిధ దేశాలలో వాటి నిల్వలపై ఎప్పటికప్పుడు సమాచారం సేకరించి, అందుకనుగుణంగా దిగుమతి సుంకంలో మార్పు చేసేందుకు ఒక ఆటోమేటిక్ వ్యవస్థ కావాలి. లేకుంటే ఈ సమస్య పరిష్కారం కానే కాదు.

### ఎగుమతులే మార్గం!

తాత్కాలికంగా, ఇప్పటికిప్పుడు రైతులను గట్టెక్కించడానికి తక్షణం చేయవలసిన పని - విదేశాలకు ఎగుమతులు. కొరియా, టర్కీ, దక్షిణాఫ్రికా వంటి దేశాలలో బియ్యానికి గిరాకీ వుంది. కేంద్ర ప్రభుత్వం కనీసం 20 నుంచి 30లక్షల టన్నుల బియ్యం ఆ దేశాలకు పంపగల్గితే దేశంలో ధరలు స్థిరపడతాయి. ప్రైవేటు వ్యక్తుల ద్వారా ఇది సాధ్యం కాదు; విదేశీ మార్కెట్‌లో బియ్యం ధరలు చాలా తక్కువగా వుండడమే అందుకు కారణం. ప్రభుత్వం నేరుగా ఎస్‌టిసి వంటి సంస్థల ద్వారా, ఎగుమతులు చేయాలి; లేదా అంతర్జాతీయ ధరలకు అనుగుణంగా ప్రైవేటు సంస్థలకు ఎఫ్‌సిఐ నుంచి బియ్యం తక్కువ ధరకు అమ్మి, ఎగుమతులు ప్రోత్సహించాలి. ఇందువల్ల కేంద్ర ప్రభుత్వానికి కొంత నష్టం తప్పదు. కాని కోట్లాది మంది రైతుల కన్నీళ్లు తుడవడం కంటే ఆ నష్టం లెక్కించదగినది కాదు. డబ్ల్యుటిఒ నిబంధనల ప్రకారం వ్యవసాయంపై సబ్సిడీలకు అంక్షలున్నాయి కాని, ప్రభుత్వమే వ్యాపార నష్టం భరించడానికి అభ్యంతరాలు లేవు. ఇందుకు కావలసిందల్లా రాజకీయపరమైన నిర్ణయం మాత్రమే.

### రాష్ట్ర ప్రభుత్వం చేయగల్గింది ఏదీ లేదా?

ధరల పతనానికి రాష్ట్ర ప్రభుత్వం కారణం కాదన్నమాట నిజం కాని, ఈ అగచాట్ల నుంచి రైతులను గట్టెక్కించడానికి రాష్ట్ర ప్రభుత్వం చేయదగింది ఏదీ లేదని; ఏమి జరిగినా కేంద్రం ద్వారానే జరగాలనే చెప్పడం మాత్రం వాస్తవం కాదు. ముఖ్యమంత్రికి, రాష్ట్ర ప్రభుత్వానికి చిత్తశుద్ధి వుంటే - కొన్ని తక్షణ ఉపశమన చర్యలు చేపట్టవచ్చు. కిలో రెండు రూపాయల సబ్సిడీ బియ్యం పథకం ద్వారా రాష్ట్ర ప్రభుత్వం నెలకు రెండు లక్షల టన్నులకుపైగా బియ్యం ఎఫ్‌సిఐ నుంచి సేకరించి, రేషన్ షాపులకు సరఫరా చేస్తున్నది. మార్క్‌ఫెడ్, సివిల్ సప్లయిస్ కార్పొరేషన్ల ద్వారా ప్రభుత్వం ద్వారా ప్రభుత్వం నేరుగా ఆ బియ్యం సేకరిస్తే -మార్కెట్‌లో పోటీ పెరుగుతుంది; కనీస మద్దతు ధరకైనా మిల్లర్లు ముందుకు రాక తప్పదు. మద్దతు ధర చెల్లించని మిల్లర్లను అరెస్ట్ చేస్తామని ఇప్పటికి వందసార్లు బెదరింపు ప్రకటనలు చేశారు ముఖ్యమంత్రి. కాని ఒక్కరంటే ఒక్కరిపై చర్య తీసుకొన్న దాఖలా లేదు. నిత్యావసర వస్తువుల చట్టం చాలా పదునైనది. దాన్ని అమలు చేయడానికి విజిలెన్స్ వంటి విభాగాలు, యంత్రాంగం వుంది. కాని వ్యాపారుల జోలికి వెళ్లడానికి భయపడుతున్నారు ముఖ్యమంత్రి. ఆయన మాటల్లో కాకుండా, చేతల్లో కఠినంగా వ్యవహరిస్తే పరిస్థితిలో చాలా మార్పు వస్తుంది.

* * *



Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press Ph: 0861-327354, Offset Printing at Zaminryot Press, Nellore.